

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# సాంప్రదాయిక వ్యాస మాలిక- 27



శ్రీరంగనాథస్వామి, నెల్లూరు




'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# 1. ఆహా! ఈ నాలుగు నక్షత్రాలు!

(శ్రీమాన్ వేలుక్కుడి కృష్ణన్ స్వామి En pani 3074 సౌజన్యంతో)

చాలా ఆశ్చర్యకరమైన, భావించి ఆనందించదగిన ఒకానొక సామ్యం. ఈనెలలో, అంటే, పుష్యమాసంలో మృగశిరానక్షత్రంలో అయోధ్యానగరంలో బాలరాముని అర్చావిగ్రహప్రతిష్ఠ జరిగింది. ఆ అయోధ్యా నగరంలోనే త్రేతాయుగంలో శ్రీరాముడు ఏ నక్షత్రంలో అవతరించాడు? శ్రీరామాయణం శ్రీరామచంద్రుడు చైత్రమాసంలో పునర్వసు నక్షత్రంలో అవతరించినట్లు తెలుపుతున్నది. ఈ పునర్వసు నక్షత్రం మృగశీర్షా నక్షత్రంనుండి రెండవ నక్షత్రం. ఈ రెండిటి మధ్యలో ఆర్ద్రా నక్షత్రం ఉన్నది. ఈ రెండిటినీ గమనిస్తూ ఆలోచించినప్పుడు, ఒక విషయం మనకు గోచరిస్తుంది. ఎందుకు బాల రాముని అర్చామూర్తి ప్రతిష్ఠ మృగశిర్షా నక్షత్రంలోనే చేయబడింది? భగవంతుడు ఎందుకు ఈ విధంగా సంకల్పించాడు? దీనికి రెండు దినాలు ముందుగానో, రెండు దినాలు తరువాతనో, విగ్రహ ప్రతిష్ఠ జరిగి ఉండకూడదా? లేక, పునర్వసు నక్షత్రంనాడే జరిగి ఉండకూడదా? ఆ నక్షత్రంనాడేకదా శ్రీరాముడు అవతరించాడు.

ఈ ప్రశ్నలకు ఒక విధంగా మనం సమాధానం చెప్పుకోవచ్చు. బాలరాముని ప్రతిష్ఠకు పంచాంగం లెక్కల ప్రకారం మృగశీర్షా నక్షత్రం మంచిది అయి ఉండవచ్చు, అందువల్ల నక్షత్రంలో జరిగింది అని భావించవచ్చు. ఆ కారణంచేతనే పెద్దలు ఆ నక్షత్రంనాడు ప్రతిష్ఠాకార్యక్రమాన్ని నిర్ణయించి ఉంటారు అని ఒక విధంగా మనం బదులును చెప్పుకోవచ్చు.

కానీ, ఈ విషయంలో మనం ఇంకా కొంచెం లోతుగా భావిస్తే, ఒక మధురమైన, ఆశ్చర్యకరమైన అంశం గోచరిస్తుంది. బాలరాముని విగ్రహప్రతిష్ఠ

సోమవారంనాడు మృగశీర్షా నక్షత్రంలో జరిగింది. ఆ దినానికి మరుసటి దినం, మంగళవారంనాడు ఆరుద్రా నక్షత్రం. ఆ మరునాడు బుధవారం పునర్వసు నక్షత్రం. ఆ తరువాత గురువారంనాడు పుష్యమీ నక్షత్రం. ఈ నాలుగు నక్షత్రాలకు ఉండే వైలక్షణ్యం ఏమో కొంచెం మనం భావించాలి. అప్పుడు, సోమవారంనాడు మృగశీర్షా నక్షత్రంలో బాలరాముని విగ్రహ ప్రతిష్ఠ జరగడంలో ఉండే ఒక అద్భుతమైన సామ్యాన్ని మనం గ్రహించే అవకాశం ఉన్నది.

ఈ పుష్యమాసం మృగశిరా నక్షత్రంనాడు శ్రీరాముని విగ్రహ ప్రతిష్ఠ జరగడం అందరికీ తెలిసిన విషయమే. ఆ మరునాటి నక్షత్రం ఆరుద్ర. ఈ నక్షత్రంలోనే వేయి సంవత్సరాలకు ముందు, భగవద్రామానుజులు అవతరించారు. చైత్రమాసంలోని ఆర్ద్రానక్షత్రంలో భూతపురి అనబడే శ్రీపెరుంబూదూర్ అనే దివ్యదేశంలో ఆ మహాచార్యులు అవతరించారు. ఆ తరువాత నక్షత్రం పునర్వసునక్షత్రం. ఈ నక్షత్రంలోనే శ్రీరామచంద్రుడు త్రేతాయుగంలో, ఇప్పటికి కొన్ని లక్షల సంవత్సరాలకు ముందు, అయోధ్యానగరంలో చైత్రమాసంలో అవతరించాడు. ఈ విధంగా చైత్రమాసం ఆరుద్రానక్షత్రంలో భగవద్రామానుజుల అవతారం. చైత్రమాసం పునర్వసు నక్షత్రంలో శ్రీరామచందుని అవతారం. ఈ రెండు అవతారాలు చైత్రమాసంలోనే జరిగాయి. అవతరించిన సంవత్సరాలు వేరు వేరు కావచ్చు, యుగాలు వేరు వేరు కావచ్చు. కానీ, ఒకే మాసంలో వరుస నక్షత్రాలలో ఈ ఇద్దరి అవతారాలు సంభవించాయి. విభవరూపాలలో ఈ ఇద్దరు అవతరించిన నక్షత్రాలు ఒకే మాసంలో సంభవించాయి. ఇది ఒక విధమైన, భావించదగిన సామ్యం.

ఆరుద్ర, మృగశిర అనే ఈ రెండు నక్షత్రాలకు ముందు వెనుకలలో ఉండే రెండు నక్షత్రాలను గమనిద్దాం. అవి, మృగశిరా నక్షత్రం, పుష్యమీ నక్షత్రం కదా.

మృగశిరానక్షత్రంనాడు శ్రీరామచంద్రుడు అవతరించిన అయోధ్యానగరంలో ఆ శ్రీరాముని అర్చావిగ్రహప్రతిష్ఠ. పుష్యమీ నక్షత్రంనాడు భగవద్రామానుజులు అవతరించిన భూతపురిలో వారి అర్చామూర్తి విగ్రహప్రతిష్ఠ జరిగాయి ఆ క్షేత్రంలో వారు అవతరించిన ఆరుద్రానక్షత్రనుండి ఆరంభించి, వరుసగా మూడు దినాలపాటు పుష్యమీనక్షత్రంవరకు గురుపుష్యోత్సవం అనే పేరుతో అర్చామూర్తిప్రతిష్ఠ చేయబడిన సందర్భాన్ని పురస్కరించుకొని ప్రతి సంవత్సరం ఉత్సవాలు జరుపబడుతాయి. ఆరుద్రా నక్షత్రం శ్రీరామానుజుల విభవావతారనక్షత్రం. పునర్వసు శ్రీరాముని విభవావతానక్షత్రం. పుష్యమి శ్రీరామానుజుల అర్చామూర్తి విగ్రహప్రతిష్ఠ జరిగిన నక్షత్రం. ఈ విగ్రహప్రతిష్ఠ శ్రీరామానుజుల జీవితకాలం చివరలో చేయబడింది.

ముదలియాండాన్ వాధూలవంశంలో అవతరించినవారు శ్రీరామానుజులకు మేనల్లుడు. దాశరథి అనే పేరును కలిగినవారు. వారి కుమారులు కందాడై ఆండాన్. వీరు శ్రీరామానుజుల అర్చామూర్తిరూపాన్ని వారు అవతరించిన భూతపురిలో ప్రతిష్ఠ చేయాలని సంకల్పించి, శిల్పిని పిలిపించి, ఆ మూర్తిని నిర్మింపజేసి, దానిని తీసుకొని పోయి శ్రీరామానుజులకు చూపించారు. వారుకూడా దానిని చూసి సంతోషపడి, తమ చేతులతో దానిని తాకి, తమ శక్తిని ఆ రూపంలో ప్రవేశపెట్టారు. అందువల్ల ఆ మూర్తి ప్రతిష్ఠచేయబడిన సమయంలో శ్రీరామనుజులకు శరీరంలో చాలా ఆశక్తి కలిగింది అని పెద్దలు అంటారు. ఈ విధంగా రామానుజులు జీవించి ఉండగానే వారి అర్చామూర్తిప్రతిష్ఠ చేయబడింది. శ్రీరామానుజులు అభిమానించిన రూపం కనుక, ఈ మూర్తికి "తాన్ ఉగంద తిరుమేని" అని సంప్రదాయంలో పేరు.

ఆహా! ఈ నాలుగు నక్షత్రాలు!

ఇప్పుడు, మృగశిర, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి –అనే ఈ వరుస నక్షత్రాల మధ్య ఉండే, ఒక విధమైన అందమైన సామ్యాన్ని గమనించవచ్చు. పుష్య మాసం మృగశిరానక్షత్రంనాడు అయోధ్యలో శ్రీరాముని అర్చామూర్తి విగ్రహప్రతిష్ఠ. ఇది, అత్యంతసమీపకాలంలో జరిగింది. ఈ మాసంలోనే పుష్యమీ నక్షత్రంలో రామానుజుల అర్చామూర్తి విగ్రహప్రతిష్ఠ జరిగింది. ఇది సమీపకాలంలో కాదు, కానీ, ఈ నెలలోనే జరిగింది. ఈ విధంగా శ్రీరామ, శ్రీరామానుజుల విగ్రహప్రతిష్ఠలు వరుస నక్షత్రాలలో, ఒకే మాసంలో, జరిగాయి.

ఈ రెండు నక్షత్రాలకు మధ్య ఉండే రెండు నక్షత్రాలలో, అంటే, ఆరుద్ర, పునర్వసు నక్షత్రాలలో, శ్రీరామానుజుల, శ్రీరాముని విభవరూపాల అవతారాలు సంభవించాయి. ఇవికూడా ఒకే నెలలో జరిగాయి. ఒకే యుగంలో కాకపోయినా, వేరు వేరు యుగాలలో జరిగినా, ఒకే నెలలో ఈ రెండు జరిగాయి.

శ్రీరామునకు పుష్యమాసం మృగశిరానక్షత్రంలో ప్రతిష్ఠ,. శ్రీరామానుజులకు పుష్యమాసం పుష్యమలో ప్రతిష్ఠ. ఈ ఇద్దరూ, అంటే, శ్రీరామానుజులు, శ్రీరాముడు ఒకే నెలలో, ఆరుద్ర, పునర్వసు అనే వరుస నక్షత్రాలలో అవతరించారు. ఈ విధంగా ఈ నాలుగు నక్షత్రాలు వరుసగా ఏర్పడి ఉండడమే చాలా అద్భుతమైన విషయం. శ్రీరాముని మృగశిరా నక్షత్రం, శ్రీరామానుజుల ఆరుద్రా నక్షత్రం, శ్రీరాముని పునర్వసు నక్షత్రం, శ్రీరామానుజుల పుష్యమీనక్షత్రం. ఈ విధమైన వరుస ఒక దివ్యమైన సామ్యం, ఇది భావించి ఆనందించదగిన సామ్యం. స్వస్తి.

★★★★★

# 2. మాఱనేర్ నంబి

వీరు శ్రీయామునాచార్యులవారి శిష్యులు. శ్రీరంగంలోని దివ్యాలయంలో శిల్పరూపంలో నిర్మింపబడి ఉండే శ్రీయామునుల రూపానికి ఇరువైపులా వారి శిష్యులైన మాఱనేర్నంబి, దెయ్ వ వారి ఆండాన్ మూర్తులను మనం గమనించవచ్చు.

వీరు ఆషాఢ మాసం ఆశ్లేషానక్షత్రంలో జన్మించారు. పాండ్యదేశంలోని పరాంతకం అనే గ్రామం వీరి జన్మస్థలం. వీరు శ్రీయామునుల శిష్యులు, వీరు పరమపదించిన చోటు శ్రీరంగం.

శ్రీయామునుల పరిపూర్ణమైన అనుగ్రహానికి పాత్రమైనవారు, వీరు. నాల్గవ వర్ణంలో జన్మించారు. తమ ఆచార్యులైన శ్రీయామునుల పైన, శ్రీరంగనాథుని పైన సాటి లేని భక్తి ప్రపత్తులను కలిగినవారు. శ్రీరంగనాథునిపై వీరికి గల గొప్ప భక్తిని చూచి, శ్రీరంగంలో ఉండే అందరూ వీరిని చాలా గౌరవించేవారు. వీరి గుణాలు నమ్మాళ్వారులతో ఉన్నందువల్ల, వీరిని మాఱనేర్ నంబి, (అంటే, నమ్మాళ్వారులతో సాటి వచ్చే గుణపూర్తిని కలిగినవారు) అని పిలిచేవారు.

వీరు ఎల్లప్పుడూ శ్రీయామునుల సన్నిధిలో కాలక్షేపాన్ని శ్రవణం చేయడంలో ఆసక్తిని కలిగి ఉండేవారు అని ప్రసిద్ధి. ఇంతే కాకుండా, వీరు ఎల్లప్పుడూ శ్రీరంగనాథుని గుణానుభవంలో చాలా అవభినివేశాన్ని కలిగి ఉండేవారు. అందువల్ల శ్రీరంగంలో ప్రాకారం లోపలే వీరు నివసిస్తూ ఉండేవారు.

మాఱనేర్నంబి తమ అంతిమ సమయంలో పెరియ నంబి దగ్గర అంటే, మహాపూర్ణుల దగ్గర, తమ దేహబంధువులు అందరు శ్రీవైష్ణవులు కానందువల్ల, తాము పరమపదించిన తరువాత తమ చరమదేహాన్ని వారికి అప్పగించవద్దు – అని ప్రార్థించారు. అంతే కాకుండా, అంతిమక్రియలు అన్ని మహాపూర్ణులు చేయాలి అని కూడా కోరారు. వారి తమ శరీరాన్ని హవిస్సుతో సమానమని భావించారు. అంటే యజ్ఞంలో సమర్పింపబడే హవిస్సు అనేది భగవంతునకు మాత్రమే

సమర్పించదగినదై ఉంటుందో, ఈ ప్రపన్నుని చరమదేహం కూడా అటువంటిదే అని, హవిస్సును ఏ విధంగా యోగ్యత లేని ఇతరులు తాక రాదో, ఆ విధంగానే, ప్రపన్నుని అంతిమదేహాన్ని వైష్ణవులు కాని ఇతరులు తాకరాదు అని వారు భావించారు.

మహాపూర్ణులు వీరి ప్రార్థనను అంగీకరించి, మాఱనేర్నంబి పరమపదించిన తరువాత వారి చరమదేహానికి అంతిమ సంస్కారాలను తామే చేశారు. దీనిని గమనించిన శ్రీవైష్ణవులు కొందరు మాఱనేర్నంబి వర్ణంవల్ల చాలా తక్కువవారు కనుక, వారి అంతిమక్రియలు పెరియనంబి చేయడం తగదు – అని పలికి, ఆ విషయాన్ని శ్రీరామానుజులకు తెలియజేశారు.

శ్రీరామానుజులు పెరియనంబిద్వారా శ్రీమాఱనేర్నంబి వైభవం ఎటువంటిదో లోకానికి తెలియజేయాలని, దానికి ఇదే తగిన సమయమని భావించారు. అందువల్ల, వారు తమ ఆచార్యులైన మహాపూర్ణుల దగ్గరకు వెళ్లి, "స్వామీ! ఎందుకు మీరు ఈ విధంగా చేశారు? ఈ విధంగా మీరు చేయడం తగునా?" అని ప్రశ్నించారు. "నేను అందరికీ శాస్త్రాల పైన విశ్వాసం ఏర్పడి, అది అభివృద్ధి కావాలి –అని కొన్ని కార్యాలను చేస్తూ ఉంటే, మీరు ఎందువల్ల ఈ విధంగా శాస్త్రవిరుద్ధమైన కార్యాలను చేస్తున్నారు?" అని ప్రశ్నించారు.

అప్పుడు పెరియనంబి సమాధానం పలుకుతూ, "భాగవతకైంకర్యానికి మనం వేరొకరిని నియమించడం సాధ్యం కాదు కదా! మనమేకదా, దానిని చేసి ముగించాలి! ఇది ఇంత మాత్రమే కాదు, శ్రీరాముడు జటాయువునకు అంతిమ క్రియలను చేశాడు. నేను శ్రీరాముని కంటే గొప్పవాడనా? కాదు కదా! ఈ నంబికూడా జటాయువు కంటే తక్కువవారా? కాదు కదా! అందుచేత, నేను వీరికి చేసిన చరమదేహకైంకర్యం ఏమీ తప్పు కాదు. శ్రీనమ్మాళ్వారులు తిరువాయ్ మొళి ప్రబంధంలో "పయిలుమ్ శుడరొళి" (3–7), "నెడుమాఱ్కడిమై" (8 –10) దశకాలలో భాగవతశేషత్వాన్ని ఉద్దేశించి చాలా గొప్పగా చెప్పారు. అది కేవలం

తత్వార్థం మాత్రమేనా? కాదు కదా! మనం ఆళ్వారులు పలికిన దివ్యమైన సూక్తిని సాధ్యమైనంతవరకు అనుసరించాలిసుమా! ” అని అన్నారు. ఈ సమాధానాన్ని విని శ్రీరామానుజులు చాలా సంతోషించారు. పెరియ నంబికి సాష్టాంగ పడి నమస్కరించారు.

ఈ సందర్భాన్ని అంతటినీ చూసిన అక్కడివారు అందరూ వాస్తవాన్ని గుర్తించి, పెరియనంబి చేసిన పనిని పొగిడారు. ఈ అందమైన ఐతిహ్యాన్ని శ్రీవరవరమునులు శ్రీవచనభూషణంలోని 234వ సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ ఉదాహరించి, వివరించారు.

మాఱనేర్నంబికి సంబంధించిన ప్రస్తావనలు దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో కొన్ని చోట్ల మనకు గోచరిస్తాయి. తిరుప్పావై ప్రబంధంలోని 29వ పాశురానికి జనన్యాచార్యులవారి వ్యాఖ్యానంలో వీరి ప్రస్తావన కనిపిస్తుంది. ఈ పాశురవ్యాఖ్యలో శ్రీరామానుజులు పెరియనంబికి మధ్య జరిగిన ఒక సంభాషణ చాలా అందంగా వివరింపబడింది.

మాఱనేర్నంబి చివరి కాలంలో, వారికి దేహంలో ఏర్పడే కొన్ని తీవ్రమైన అవస్థలను సహించవలసి వచ్చింది. ఆ సమయంలో తమ చివరి క్షణంలో తాము భగవంతునిగూర్చి ధ్యానించడం తమకు వీలవుతుందో! లేదో! అని వారు చాలా బాధపడ్డారు. వారి ఆ స్థితిని చూసిన పెరియనంబి, శ్రీరామానుజులతో ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, “ఒకవేళ నంబి చివరి క్షణంలో భగవంతుని స్మరించలేక పోతే, వారికి పరమపదం లభిస్తుందా?” అని ప్రశ్నించారు. దీనికి శ్రీరామానుజులు “వరాహచరమ శ్లోకంలో ఉత్తరవాదాన్ని ఆ స్వామి అనుగ్రహించాడు కదా. అంటే, ఎవడు, తనను శరణు పొందాడో, అతనిని, అతని చివరి సమయంలో నేనే స్మరించి, నేనే స్వయంగా అతనిని పరమపదానికి తీసుకుని పోతాను– అని అన్నాడు కదా” అని సమాధానం పలికారు. అప్పుడు పెరియనంబి “ఆ మాటలను నమ్మడానికి వీలు కాదు. ఎందుకంటే, అతడు, దానిని భూదేవి మీద ఉండే వాత్సల్యంతో చెప్పాడు,

అంతే. అందువల్ల అది స్వీకరించడం సాధ్యం కాదు. అందరి విషయంలో ఆ విధంగా భగవంతుడు ప్రవర్తిస్తాడని అనుకోవడానికి వీలు లేదు" అని అన్నారు.

అప్పుడు శ్రీరామానుజులు "భూదేవి ఎల్లప్పుడూ భగవంతునితో కలసి ఉంటుంది కనుక, ఆమెను సమాధాన పరచడంకోసంగా మాత్రమే అతడు ఈ మాటలను చెప్పి ఉండడు." అని అన్నారు. వెంటనే పెరియ నంబి "ఒకడు భగవంతుని విషయంలోనే అభినివేశాన్ని కలిగి ఉంటే, అతనికి మోక్షం ఇవ్వబడుతుంది – అని ఏ విధంగా చెప్పబడింది? దానికి ప్రమాణం ఏమి? " అని అడిగారు. దానికి శ్రీరామానుజులు బదులు పలుకుతూ, " శ్రీకృష్ణుడు అనుగ్రహించిన గీతలోని (4 –10) సూక్తి దీనికి ప్రమాణం. గమనించండి. "జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సో ఽ ర్జున! " (అర్జునా! నా అవతారాలు అన్ని, ఆ అవతారాలలోని లీలలు అన్నీ దివ్యమైనవి. ఈ విషయాన్ని ఎవడు యథాతథంగా తెలిసికొంటాడో, అతడు, ఈ దేహాన్ని విడచిపెట్టిన తరువాత మళ్లీ తిరిగి జన్మించడు, నన్ను చేరతాడు) అని అన్నాడు కదా!" అని బదులు పలికారు. దీనిని విని మహాపూర్ణులు చాలా సంతోషించారు.

పెరియ తిరుమొళి ప్రబంధంలోని (7–4) వ దశకానికి అవతారికను అనుగ్రహిస్తూ, పెరియవాచ్చాన్ పిళ్ళై నంబికి సంబంధించిన ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావించారు. ఈ దశకంలో భాగవతశేషత్వపారతంత్ర్యాలు చెప్పబడుతున్నాయి. ఇందులోని "కణ్ శోర వెమ్ కరుది" అనే పాశురంలో తిరుచ్చేఱై అనే క్షేత్రంలోని సారనాథస్వామి సన్నిధిలో శరణు పొందిన శ్రీవైష్ణవులను చాలా పొగిడారు. తిరుమంగై, ఆళ్వారులు. ఈ దశకావతారికలో వ్యాఖ్యాత, ఈ దివ్యదేశంలో పెరియనంబి మాఱనేర్ నంబికి చేసిన అంతిమ సంస్కారాలను గూర్చి ప్రస్తావించారు.

సరోయోగి అనుగ్రహించిన ముదల్ తిరువందాది ప్రబంధంలోని మొదటి పాశురానికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించే నంబిళ్ళై, మాఱనేర్ నంబికి సంబంధించిన

ఒక వృత్తాంతాన్ని ప్రసావించారు. "భగవంతుని మరవకుండా ఉండడానికి ఏదైనా ఒక దారి ఉన్నదా?" అని ఒకరు మాఱనేర్ నంబి వద్ద అడిగారట. అప్పుడు నంబి బదులు పలుకుతూ, "భగవంతుని మరచిపోవడానికి ఏదైనా ఒక మార్గం ఉన్నదా?" అని తిరిగి ప్రశ్నించారట. ఎందుకంటే, వరు ఎల్లప్పుడూ భగవంతుని గూర్చి ధ్యానిస్తూ ఉండేవారు అందువల్ల భగవంతుని మరచిపోవడం సాధ్యం అని భావించడానికి కూడా వీరికి అవకాశం లేకపోయింది.

ఈవిధంగానే శ్రీవచనభూషణంలోని 324వ సూత్రంలోకూడా వీరి ప్రస్తావన కనిపిస్తుంది. శ్రీపిళ్ళైలోకాచార్యులవారు శ్రీవైష్ణవుల గొప్పతనాన్ని ఈ సూత్రంలో చెప్పారు. ఒకడు జన్మించే వర్ణం వల్ల అతనికి ఉండే గొప్పతనాలకు లోటు రాదు – అని అందులో అన్నారు. దీనికి వారు పలు ఉదాహరణలను ప్రస్తావిస్తూ, అందులో ఒక ఉదాహరణగా మహాపూర్ణులు తాము మాఱనేర్నంబికి చేసిన అంతిమ సంస్కారాలనుగూర్చి భగవద్రామానుజులకు వివరించిన విషయాన్ని ప్రస్తావించారు.

ఆచార్యహృదయగ్రంథంలోని 85వ సూత్రంలో ఆ గ్రంథనిర్మాత నాయనార్ తమ అన్నగారైన శ్రీపిళ్లైలోకాచార్యులవారు సూక్తిని అనుసరించి మాఱ నేర్ నంబి గొప్పతనాన్ని ఒక చూర్ణికలో (85) ప్రస్తావించారు. ఈ విధంగా పూర్వాచార్యుల గ్రంథాలలో పలుచోట్ల వీరికి సంబంధించిన వివరాలు కొన్ని కనిపిస్తాయి.

వీరి తనియన్

**"యామునాచార్యసచ్ఛిష్యం రంగస్థలనివాసినమ్,**
**జ్ఞానభక్త్యాదిజలధిం మారనేరిగురుం భజే"**

★★★★★★★

# 3. శ్రీరామాయణంలో అహల్య – ఒక విహంగ వీక్షణం

(ఇది, వైదికశ్రీ అనే తమిళమాసపత్రికలోని వ్యాసాన్ని అనుసరిస్తూ రాయబడినది)

శ్రీరామాయణంలో మనకు కనిపించే పలు పాత్రలలో అహల్య ఒకటి ఈమె గౌతముని ధర్మపత్ని. అహల్య అంటే వైరూప్యం ఏమాత్రం లేనిది, అంటే, సాటి లేని అందాన్ని కలిగినది – అని అర్థం. హల్యం అంటే నాగలిచేత దున్నబడిన భూమి. అంతకు ముందు చదునుగా ఉండే భూమి, నాగలిచే దున్నబడినప్పుడు, అందులో ఒక వైరూప్యం కలుగుతుంది. అటువంటి రీతిలో వైరూప్యం ఏ మాత్రం లేని రూపాన్ని కలిగినది, ఈ అహల్య, అంటే, సాటి లేని, అద్భుతమైన అందాన్ని కలిగినది – అని ఈ నామంలోని తాత్పర్యం.

ఈమె వృత్తాంతం చాలా చిత్రమైనది, ఆసక్తిని కలిగించేది, అనేక విధాలయిన మార్పులను కవులద్వారా, విమర్శకుల ద్వారా పొందినదికూడా. అంతే కాదు, స్త్రీవాదాన్ని చేసేవారికి చాలా బలమైన చర్చకు అవకాశాన్ని ఇచ్చేది, ఈమె వృత్తాంతం. శీలం అనేదానికి సనాతనధర్మంలో సరి అయిన లక్షణం ఏది? అనేదానిని ఈమె చరిత్ర మనకు తెలుపుతున్నది.

అహల్య జన్మ ఈమె జీవితం చాలా ఆసక్తికరమైనవి. ఈమె ప్రవర్తన వల్ల ఈమె పొందిన నష్టం, నైచ్యం, చివరిలో మళ్లీ అందరి మన్ననలను పొందే దశను పొందడం, దానివల్ల ఈమెకు కలిగిన కీర్తి మొదలైనవి అన్ని ఇంకా ఆసక్తికరమైనవి.

ఆహల్యచరిత్రను గమనిస్తే, ఈమె శరీరంలోనూ, మనస్సులోనూ దోషాన్ని పొందినది అని అనిపిస్తుంది అయితే, ఆ కారణంగా ఆమె తన గౌరవాన్ని కోల్పోలేదు. అందుకు మారుగా, శీలం కలిగిన స్త్రీలలో ప్రథమస్థానాన్ని పొందడానికి తగిన

యోగ్యతను పొందింది. పురాణాలలో చెప్పబడే ఐదుగురు మహాపతివ్రతలలో మొట్టమొదటగా లెక్కపెట్టబడేది ఈమెయే. లక్ష్మీస్వరూపిణి అయిన సీతాదేవి కూడా ఈమెకు తరువాతనే పరిగణింపబడడం చాలా ఆశ్చర్యకరం. ఇదే స్త్రీత్వానికి, శీలానికి సనాతన పురాణాలు చూపించే ఒక నియమం, ఒక క్రమం. శీలాన్ని చెప్పే శాస్త్రానికి ఒక చక్కని ఉదాహరణం.

ఈమె చరిత్ర శ్రీరామాయణంలో చాలా సంగ్రహంగా చెప్పబడింది. వాల్మీకి రామాయణంలో 40 శ్లోకాలలో ఈమె చరిత్ర చెప్పబడింది. అయినప్పటికీ, అహల్య చాలా గొప్పదైన వ్యక్తిగా, శక్తిగా పరిగణింపబడుతున్నది. అహల్యకథ లేకుండా శ్రీరామాయణ గాథ చెప్పబడదు.

అహల్యావృత్తాంతంలో ఇమిడి ఉండే సూక్ష్మమైన, తెలియదగిన అంశాలు చాలామందికి తెలిసినట్లు తోచదు. అహల్య దోషాన్ని పొందినదని శ్రీరాముని పాదస్పర్శచేత తన శాపాన్ని పోగొట్టుకున్నదని అంటున్నారు.

ఈమె చరిత్రను పూర్తిగా రాయడానికి, స్త్రీశీలాన్ని నిరూపించే మార్గానికి సరియైన లక్షణాన్ని చూపించడానికి ఈ వ్యాసం ప్రస్తావింపబడుతున్నది.

విశ్వామిత్రుడు శ్రీరాముని అరణ్యాలకు తీసుకుని పోవడం సీతాదేవితో అతనికి వివాహం జరిపించడంకోసం – అని పురాణకారులు అంటున్నారు. అయితే, అరుణగిరినాథుడు అనే కవి ఈ విధంగా చెప్పలేదు. శ్రీరాముడు అరణ్యాలకు వెళ్లడం అహల్యను అనుగ్రహించడం కోసం అని తన కావ్యంలో అన్నాడు.

"కల్లిలే పాற்றா పడవే అదు నల్ల రూపత్తై వరక్కానిడై కౌరవై తీరప్పోకుమ్ ఇరాగవన్" అనేది అతని సూక్తి.

వేల సంవత్సరాలుగా శ్రీరాముని పాదధూళి స్పర్శను ఆశిస్తూ పడి ఉన్న ఈ భక్తురాలిని అనుగ్రహించడంకోసం అరణ్యాలకు వచ్చాడు– అని అన్నాడు, ఆయన.

# శ్రీరామాయణంలో అహల్య – ఒక విహంగ వీక్షణం

ముందుగా పురాణాలలోని ఈమె చరిత్రను గమనిద్దాం.

లోకంలో సృష్టింపబడే స్త్రీల అందాన్ని అంతటినీ ఒకచోట పోగుచేసి అహల్యగా సృష్టించాడు, బ్రహ్మ. అంతటి అందాన్ని ఈమె కలిగినది. సృష్టించినవాడు ఆమెను గౌతమునికి భక్తిగా అయ్యేటట్లు చేశాడు. గౌతముడు సప్తర్షులలో ఒకడు. తపస్సులో చాలా గొప్పవాడు. ఉన్నతమైన గుణాలను, ప్రవర్తనను కలవాడు. అందమంతా మూర్తీభవించినట్లుగా ఉండే అహల్యను రక్షించడానికి జితేంద్రియుడైన ఈ మునియే తగిన వ్యక్తి అని భావించాడు కాబోలు, బ్రహ్మ.

కామం అనేది ఎవరిని విడచి పెడుతుంది? అది మన జన్మకే కారణంకదా. పరుని భార్య పొందుకోసం ఆశపడ్డాడు, దేవేంద్రుడు. ఇదే ఇక్కడ ఒక పెద్ద ఉదాహరణ. దేవతలు మనవలెనే కర్మలకు, వాసనలకు లోబడినవారే. వీరు పరదైవాలు కారు. 33 కోట్ల దేవతలు ఉన్నారు – అని ఈ విధంగా పలకడం అంతా, పరదైవానికి, దేవతలకు మధ్య ఉండే తేడాను తెలియకపోవడమే.

కామంవల్ల జ్ఞానం నశిస్తుంది. " మైయలాల్ అఱివు నీంగి" (వ్యామోహం వల్ల జ్ఞానం తొలగిపోతుంది) అని కంబ మహాకవి కూడా అంటాడు. ఇంద్రుని మాటను విని, చంద్రుడు కూడా నడు రేయిలో కోడి రూపాన్ని ధరించి, గౌతముడు ఆ ధ్వనిని విని, నిద్రలేచి, నదీతీరానికి స్నానం చేయడంకోసం వెళ్ళాడు.

భారతీయ సంస్కృతి, సంప్రదాయాలు ఒక గొప్పదైన విజ్ఞానశాస్త్రం. అక్కడ చెప్పబడిన ఆచార వ్యవహారాలు కేవలం నమ్మకంతో మాత్రం ముడి పడినవి కావు. మట్టితో ఏర్పడిన శరీరాన్ని మంత్రశరీరంగా నిత్యం పరిణమింప చేయడం ఆవశ్యకం. మంత్రాలనేవి కేవలం వాగ్రూపాలు కావు. అవి తగిన సాధనాలతో ఏర్పడే విద్యుచ్ఛక్తివంటివి. వాటిని తగిలినట్లుగా ఉపయోగపరచినట్లయితే, తగిన ఫలాన్ని పొందవచ్చు. మంత్రాల పుస్తకాన్ని చదివితే, అంత మాత్రంతో ఫలం సిద్ధించదు.

ఆచార్యముఖంగా వాటిని ఉపదేశరూపంగా పొంది, తగిన సమయంలో తగిన రీతిలో ఉపాసించాలి.

అరుణోదయకాలంలో, అంటే, తెల్లవారుజామున నాలుగున్నర గంటల సమయంలో స్నానం చేయాలి అని చెబుతున్నది, శాస్త్రం. సూర్యుడు ఉదయించడానికి ముందే నిద్ర లేవనివాడు పాపాలను మూట కట్టుకుంటున్నాడు. శ్రీరామాయణంలో కూడా భరతుడు శ్రీరాముని అరణ్యాలకు పోవడానికి తాను కారణం అయినందుకు చాలా బాధపడతాడు. అప్పుడు శ్రీరాముని అరణ్యాలకు పంపినవారు ఎంతటి పాపాన్ని మూటగట్టుకున్నారో తెలియజేసేటప్పుడు, సూర్యుడు ఉదయించిన తరువాత నిద్రలేచినవాడు ఎంతటి పాపాన్ని మూట కట్టుకుంటాడో, అంతటి పాపాన్ని శ్రీరాముని అడవులకు పంపించినవారు మూటకట్టుకుంటారని అన్నాడు.

ఇక, ప్రస్తుత వృత్తాంతంలోకి వస్తే, ఇంద్రుడు గౌతమ ముని వేషంలో వచ్చాడు. వచ్చినవాడు ఇంద్రుడు అని అహల్యకు తెలియదు – అని కొందరు చెప్పడం కూడా తప్పు. స్త్రీకి తన భర్త ఎవరో, పరాయి మగవాడు ఎవరో తెలియకుండా ఉంటుందా ఏమి? మీసాన్ని అంటించుకుని లోకాన్ని మోసం చేయడం అనేది ఈనాటి సినిమాలలో చూపించే దృశ్యం, అంత మాత్రమే.

భర్త కాలి చెప్పు చేసే ధ్వనినికూడా భార్యకు తెలుస్తుంది అని అంటారు కదా. దేవేంద్రుని చూసిన అహల్య అతనిపై వ్యామోహాన్ని పొందింది. అహల్య తెలియకుండా దోషం చేసింది, తప్పు చేసింది – అని కవులు కప్పి చెప్పలేదు. తన అందాన్ని అనుభవించడం కోసం సాక్షాత్తుగా దేవేంద్రుడే వచ్చాడు కదా! అనే ఆశతో, గర్వంతో, ఆమె సంతోషపడింది, "దేవరాజకుతూహలాత్" అని వాల్మీకి అన్నాడు. తెలిసి తప్పు చేసి, ఆమె నైచ్యాన్ని పొందింది – అని అంటాడు కంబకవి.

స్నానానికి వెళ్ళిన గౌతముడు అది సరైన కాలం కాదని గ్రహించి, ఇంటికి తిరిగి వచ్చాడు. అంతటి గొప్ప మహిమను కలిగిన మహాతపస్వికి జరిగిన తప్పు తెలియకుండా ఉంటుందా ఏమి? అయితే ముందుగానే తెలుసుకొని, అతడు దానిని వివరించకుండా ఉండడమే చాలా ఆశ్చర్యం. భగవంతుడు మనస్సులో ఆ విధంగా సంకల్పించలేదు. అందువల్లనే గౌతముడు జరగబోయే సంగతిని తెలియకుండా పోయాడు.

గౌతముడు తిరిగి రావడాన్ని గమనించిన ఇంద్రుడు, పిల్లిరూపాన్ని ధరించి, తప్పించుకొని పోవాలని చూశాడు. కానీ, ఆ మునిదృష్టినుండి తప్పించుకోవడానికి ఇంద్రునకు సాధ్యం కాలేదు.

లోకంలో నిరంతరంగా వ్యాపించే దీర్ఘమైన నిందను అన్వేషించినది, అహల్య. తిరిగి వచ్చిన గౌతముని చూచి భయపడి నిలచింది. ఆమె. "నీవు శిలవలె వర్తించావు కనుక, నీవు శిలగా పడి ఉండు" అని ఆమెను గౌతముడు శపించాడు.

ఈమె రాయిగా మారి పోయింది అని పౌరాణిక కథనం. దానిని అనుసరించి కంబుడు కూడా "కల్లియల్ ఆది" అని అన్నాడు. అయితే, ఆదికావ్యమైన వాల్మీకి రామాయణంలో మాత్రం ఆ విధంగా చెప్పబడలేదు. "ఏ ఆకారం లేకుండా, ఎవరి కంటికి కనబడకుండా, ఇక్కడే చిరకాలం పడి ఉండు" అని అన్నట్లుగానే గౌతములు శపించాడు. " వాయుభక్షా నిరాహారా తపయంతీ భస్మశాయినీ" అనేది వాల్మీకి రామాయణ సూక్తి.

గౌతముడు ఈమెకి ఇచ్చినది శాపమా? అని అంటే, పూర్తిగా శాపం అని చెప్పలేము. "తపస్సు చేస్తూ పడి ఉండు "అని అన్నాడు ముని. తపస్సును చేయడం దండన అవుతుందా? కాదు కదా! దండనలు మృగాలను ఇంకా క్రూరమైన మృగాలుగా చేయవు. వాటి మృగత్వాన్ని పోగొట్టడంకోసమే. దివ్యమైన ప్రకాశాన్ని

పొందింపజేయడం కోసమే, శాపాలు ఇవ్వబడతాయి. అవి మృగత్వాన్ని పోగొట్టుకొని, దివ్యత్వాన్ని పొంది, బాగుపడటం కోసమే. ఇదే గౌతమముని ఇచ్చిన శాపం అనే ఈ వరం.

ఈ శాపంలో ఇంకొక పాఠం కూడా ఉన్నది. కంబుడు " అహల్య రాయి వలె పడి ఉన్నది " అని అనడంలో అర్థం ఏమి? అన్యపురుషుడు తాకినపుడు మనస్సు, శరీరం రాయి వలె ఉండవలసిన స్వభావాన్ని స్త్రీ కలిగి ఉండాలి. "ఆ విధంగా లేనందు వల్ల రాయివలె పడి ఉండు" అని ముని తన శాపరూపంలో తెలియజేశాడు.

అహల్య శాపాన్ని పొందింది. అయితే, దేవేంద్రునకుకూడా శాపం ఇవ్వడం జరిగింది. స్త్రీవాదాన్ని చేసేవారు " అహల్య మాత్రమే కష్టపడింది. అలవాటు ప్రకారం మగవారు తప్పుకున్నట్లు అయినది" అని వాదిస్తారు. కానీ, ఈ మాట సరికాదు పాపానికి మూలమైన ఇంద్రునకు దండన లేదా? తప్పకుండా ఉంది. అది అహల్య పొందిన దండన కంటే తీవ్రమైన దండన. అహల్యకు విధింపబడిన శిక్ష భర్త నిరాకరణమాత్రమే. ఇది ఆమె మనసును బాధిస్తుంది. అయితే, దేవేంద్రునకు లభించినది అయితే, అవమానం, ఘోరమైన, దారుణమైన అవమానం. ఇది అహల్యకు ఇవ్వబడిన శిక్ష కంటే వెయ్యి రెట్లు కఠినమైనది. ఇది ప్రాణంతో పాటు మనస్సును దహిస్తుంది.

గౌతమ మహర్షి ఇంద్రుని ఈ విధంగా శపించాడు. "దేవేంద్రా! ఈ పాపకార్యానికి నీకు ఏమి దండన ఇస్తున్నానో తెలుసా? నీవు జీవించినంతకాలం పూర్తిగా నీవు నపుంసకుడవు కాగలవు. అంతే కాదు. ఏ యోనిలో నీవు లయించి ఇక్కడకు వచ్చావో, ఆ చిహ్నం నీ శరీరమంతా వేల సంఖ్యలో ఏర్పడుతుంది. " అని శాపాన్ని ఇచ్చాడు. అయ్యయ్యో! ఈ శాపంలోని క్రూరత ఏమని చెప్పగలం! రాయిగా మారి అరణ్యంలో ఉండడాన్ని కంటే, కొన్ని వేల రెట్లు కఠినమైనది కదా ఈ శిక్ష.

అవమానభారంతో కృశించి కృశించికదా, జీవితాన్ని గడపాలి. ఇటువంటి ఘోరమైన శాపాన్ని పొందడానికి ఇంద్రుడు తగినవాడే. అతడు చేసిన తప్పు అంతటి ఘోరమైనది.

తరువాత మిగిలిన దేవతలు అందరూ ఇంద్రుని పిలచి అతని చేత తీవ్రమైన తపస్సును చేయించి, అతని శరీరంలో ఏర్పడి స్త్రీచిహ్నాలను పురుష చిహ్నాలుగా ఏర్పడేటట్లుగా చేసి, కొంత అవమాన భారన్ని తగ్గించి అతడు జీవించగలిగేటట్లు చేశారు. ఇది శ్రీరామాయణంలో, బాలకాండలో మనకు కనిపించే అహల్యావృత్తాంతం.

అయితే, ఈ వృత్తాంతంలోని తాత్పర్యం ఏమి? అవమానం ఇంద్రునకు ఒక గుర్తుగా మాత్రమే కానివ్వండి. అతనిని అవమానం చేసే దృష్టిలో స్త్రీజాతికి అవమానం చేయవలసిన అక్కరలేదు అనేది ఇక్కడ గమనించదగినది. తనకు శాపం వల్ల ఏర్పడిన స్థితిని గూర్చి అహల్య బాధపడుతూ నిశ్చేష్ట అయినది. తనకు శాపవిమోచనం ఎప్పుడు కలుగుతుందా? అని ఉండే అహల్యకు ముని నోటినుండి "దశరథుని పుత్రుడై భగవానుడు శ్రీరాముని రూపంలో జన్మిస్తాడు. అతడు నీ దగ్గరకు వచ్చినపుడు, నీ పాదధూళి నీ పైన పడుతుంది. అప్పుడు నీ శిలారూపం మారి నిజరూపాన్ని పొందుతావు" అని మహర్షి శాపవిమోచనానికి దారిని తెలియజేశాడు. ఇది ఆమెపై ముని చూపిన స్వల్పమైన అనుగ్రహం శాపంనుండి విమోచనాన్ని పొందడానికి దారిని తెలుసుకొని, ఆ సమయం కోసం అహల్య వేలాది సంవత్సరాలుగా వేచి చూచింది. శ్రీరాముని పాదదూళి పడి, (పాదం సోకడం కాదు) , అహల్య మళ్ళీ నిజరూపాన్ని పొందింది అని వాల్మీకి, కంబ మహాకవి స్పష్టంగా చెప్పారు. ఏమైనప్పటికీ అహల్య పరాయివ్యక్తికి భార్య. ఏకపత్నీవ్రతుడైన శ్రీరాముని కాలు ఆమెపై పడింది అని అనడం కూడా సరికాదు – అనేదే ఈ కవుల స్పష్టమైన అభిప్రాయం.

గౌతముని ఆశ్రమానికి వచ్చిన శ్రీరాముని కాలి ధూళి పడి, అహల్య నిజరూపాన్ని పొంది నిలచింది. ఆమె ఆ విధంగా తన రూపాన్ని పొందగానే, శ్రీరాముడు "తల్లీ! " అని అంటూ ఆమెను సంబోధించాడు. అప్పుడు విశ్వామిత్రుడు, ఆమె ఎవరో, ఆ విధంగా ఆమె శిలారూపాన్ని పొందడానికి కారణం ఏమో, శ్రీరామునకు తెలియజేశాడు. ఆమెవృత్తాంతాన్ని తెలిసినప్పటికీ, రాముడు ఆమెను "అమ్మా" అని సంబోధించాడు. అతడు, అహల్యపై తనకు ఉండే మొదటి భావాన్ని కొంచెం కూడా మార్చుకోలేదు. సామాన్యంగా స్త్రీని "అమ్మా! , తల్లీ! " అని అలవాటు. ఆ ప్రకారం పిలవడం, ఆమె పతనాన్ని పొందింది అని తెలిసినప్పుడు ఎవరికైనా ముందున్న అభిప్రాయంలో మార్పు రావడం లోకంలో సహజం కదా. అయితే, శ్రీరాముడు ఆమె వృత్తాంతాన్ని విన్న తరువాతకూడా ఆమెను మళ్లీ "తల్లీ!" అంటూనే సంబోధించాడు అని అన్నాడు, కంబమహాకవి. ఆమెకు నమస్కరించి రాముడు, ఆమె నుండి అనుమతిని తీసుకొని ప్రయాణాన్ని కొనసాగించాడు.

ఎంత ఆశ్చర్యం! పూర్వకాలంలో దోషి అయిన ఒక స్త్రీని ప్రస్తుతకాలంలో ఉండే దయాస్వభావుడైన ఒకడు నమస్కరించడమా! అది కూడా, "తల్లీ! " అని సంబోధిస్తూ నమస్కరించడమా! అహల్య రామునకు తల్లి, మూలమైన తల్లియే. ఈ వివరాన్ని పెద్దలు శ్రీరాధాకృష్ణులు చెప్పగా నేను విన్నాను. రాముడు అహల్యను తల్లి అని పిలవడానికి తగిన సంబంధం ఆమెతో ఉన్నవాడే. కౌసల్య, కైకేయి, సుమిత్ర అనే ముగ్గురు దశరథుని భార్యలు. కానీ, అహల్య అయితే ఆ విధంగా కాదు కదా. శాపాన్ని పొందిననాటినుండి ఆమె రాముని ఎదురుచూస్తూ ఉన్నది. దశరథుని కుమారుడైన భగవంతుడే శ్రీరాముడుగా రావాలి –అని అహల్య తెలిసికొన్నది. "శ్రీరాముడు దశరథుని కుమారుడు కాగలడు" అని ముందుగానే, అంటే, శ్రీరాముడు అవతరించడానికి ముందుగానే గౌతముని నోటినుండి ఆ మాట బయటకు వచ్చింది. ఇది నిజమే కదా. ఈ లోకంలో మనకు గోచరించే శరీరాన్ని కలవాడై, కౌసల్యాదేవి గర్భంనుండి శ్రీరాముడు జన్మించడానికి ముందుగానే, అహల్యయొక్క మనస్సు అనే

గర్భంనుండి భగవానుడు శ్రీరాముడుగా రూపొందాడు. రామునికోసం, దశరధునకు ముందే, పలు సంవత్సరాలుగా మనస్సులో తపస్సు చేస్తూ, అహల్య వేచి ఉన్నది. వాస్తవం ఈ విధంగా ఉన్నప్పుడు, అహల్య శ్రీరామునకు తల్లియే కదా, ళఅవుతుంది.

అయితే, శ్రీరాముడు గౌతమమునిని సమీపించి, " "మనసులో దోషం లేని ఈమెను మీరు కలపండి. , " అని అన్నాడు. తన శరీరం వల్ల ఏర్పడిన దోషాలకు స్త్రీమనసు ఏనాడు బాధ్యురాలు కాదు. ఆమె శరీరం మాత్రమే కారణం అవుతుంది. మనస్సు వల్ల ఏర్పడే దోషానికి మానవుడు కారణం అవుతున్నాడు. చెడ్డ బుద్ధితో ఏర్పడే దోషానికి మానవుడు కారణం అవుతాడు. చెడ్డ భావనలో ఏర్పడిన తప్పును మంచి భావనతో మాత్రమే పోగొట్టుకొని, బాగుపడడానికి అవకాశం ఉన్నది. "రామ రామ" అనే తారకమంత్రంతో పలు సంవత్సరాలుగా శ్రీరాముని కోసం వేచి ఉన్న అహల్యమనస్సులో ఉండే అన్ని దోషాలు వశించిపోయాయి. రాముని స్మరించిన ఆమె మనసు దోషం లేనిది అందువల్ల ఆమె మనసులో ఏ దోషము లేనిది అయినది.

శ్రీరామాయణం తెలిపే నీతి ఇదే. శీలం అనేది కింద పడిపోతే పగిలిపోయే మట్టి పాత్ర వంటిది కాదు.

ఈ కథలో మనం తెలుసుకోవలసిన విషయాలు చాలా ఉన్నాయి.

అహల్య, తన దగ్గరకు వచ్చినవాడు పరాయి మగవాడు అని తెలిసినప్పటికీ, అతనిని పొందాలని ఆశపడి, ప్రేమతో మోహాన్ని పొంది, తప్పును చేసింది. ఆ విషయాన్ని తెలుసుకుని మనసారా బాధపడి, క్షమను అర్థించింది. ఆమె మనసారా సంస్కరింపబడడం వల్ల ముని అయిన గౌతముడు కూడా ఆమెకు మంచి దారిని చూపించాడు.

ఒక్కొక్క కార్యంబకూడా ప్రతికార్యాన్ని కలిగినదై ఉంటుంది. ఒక కారణం ఒక కార్యంలో ఏర్పడుతుంది. ఒక్కొక్క దోషం దండనకు తగినది అవుతుంది.

ఒక్కొక్క పశ్చాత్తాపం క్షమకు తలుపులను తెలుస్తుంది. ఒక్కొక్క తపస్సుకు ఫలం లభిస్తుంది. ఇదే, ఇక్కడ మనకు ఈ వృత్తాంతంలో గోచరించే సిద్ధాంతం.

తన వృత్తాంతంతో అహల్య మనకు వేదాంతాన్ని బోధిస్తున్నది. గౌతమముడు ఒక జితేంద్రయుడు. అతడు అహల్య అనే భక్తితో జీవిస్తున్నాడు. ఆ భక్తి ఇంద్రుడు అనే మనస్సుతో కలతను పొందినప్పుడు, దోషాన్ని పొందినప్పుడు, మనస్సుకు దాసురారైనపుడు, అది ఆ జితేంద్రయుని దగ్గర నుండి తొలగిపోతుంది.

తరువాత, ఆ భక్తి, ఇంద్రియాలపట్ల వెగటును పొంది, బాధపడి, రాయివలె కఠినమైన తపస్సులో లగ్నమవుతుంది, అంటే, బాహ్యా జగత్తునుండి తొలగిపోతుంది. ఆ తపస్సు ఫలంగా అఖండమైన పరమాత్మయొక్క అనుగ్రహంచేత మనసుకు ఏర్పడిన దోషం తీరి, తన సహజమైన గొప్పతనాన్ని పొంది తన జితేంద్రియత్వాన్ని పొందుతుంది.

ఈ కథ భావుకులకు ఎల్లప్పుడూ బలాన్ని ఇస్తున్నది. “తపస్సుతో పాపాలు తొలగించుకొని, తన పూర్వ వైభవాన్ని ఏ జీవుడు పొందడానికి వీలవుతుంది “అనే ఈ కథ తెలియజేస్తున్నది. జీవుడు ఆశాపాశాలతో ఎల్లప్పుడూ కట్టుబడి ఉంటాడు. అందువల్ల తన శీలాన్ని కోల్పోతాడు. దానిని తపస్సుతోను, జ్ఞానంతోను అతడు పొందాలి. పొందడానికి వీలవుతుంది కూడా. దీనిని పొందడానికి బలమైన సరి అయిన మార్గమే మంత్రాలు. తన దారిలోనుండి, శక్తిలోనుండి తొలగిపోకుండా ఉండడానికి అతడు ఎల్లప్పుడూ జాగరూకతతో ఉండాలి. ఆ విధంగా దృఢమైన ప్రయత్నంతో తన మార్గం నుండి తొలగిపోకుండా చేసే ప్రయత్నంలో ఏర్పడిన కన్నీరువల్ల, బాధవల్ల తన ప్రయత్నాన్ని మానకుండా, స్థిరంగా ఇంకా కృషి చేసినట్లయితే, తపస్సును కొనసాగిస్తే, అప్పుడు, అతనిలో ఉండే దోషం లేకుండా పోతుంది. ఇది నిశ్చయం.



# 4. "రామః– మనత్తుక్కినియాన్"

(గోదాసూక్తి వైభవం)

ఆళ్వారులు అందరూ చాలా అందమైన మధురమైన, పాశురాలను ద్రావిడ భాషలో అనుగ్రహించిన విషయం లోకవిదితం. వారి పాశురాలలో ఉండే శబ్దమాధుర్యం, అర్థగాంబీర్యం ఎంత గొప్పవో మనకు మన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో తెలియజేశారు. అళ్వార్లు తమ ప్రబంధాలలో, కొన్ని సందర్భాలలో, సంస్కృత నామాలను చాలా అందంగా ద్రావిడకరించిన సందర్భాలుకూడా మనకు గోచరిస్తాయి. వాటిలో, ఒక ద్రావిడీకరణం ఇక్కడ ప్రస్తావించడం జరుగుతున్నది.

భగవంతుని నామాలలో రామః" అనే నామం ఒకటి. ఈ నామాన్ని ఆళ్వారులు "ఇరామన్" అని ద్రావిడీకరించి, పలుచోట్ల దానిని ప్రయోగించారు. నమ్మాళ్వారులు తిరువాయ్ మొழிప్రబంధంలో కఱ్పార్ ఇరామపిరానై యల్లాల్ మఱ్ఱుమ్ కఱ్పరో " (లోకంలో మంచి ప్రవర్తననుగూర్చి తెలుసుకోగోరినవారు శ్రీరాముని చరిత్రలను తప్ప, వేరొకరి చరిత్ర, ను అధ్యయనం చేస్తారా?) అని ఈ నామాన్ని ప్రయోగించారు. ఇది ఇక్కడ విషయం కాదు. ఈ నామాన్ని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో ఎంత అందంగా ద్రావిడ భాషలోమార్చి ప్రయోగించారో గమనించండి.

ఈ రామశబ్దానికి సరి అయిన అందమైన ద్రావిడీకరణం ఏది? దానిని గోదాదేవి ఏవిధంగా ఉపయోగించారు? అని అంటే,

వశిష్ట మహర్షి రామునకు రాముడనే నామాన్ని పెట్టారు. ఈ పేరు ఆవిధంగా వారు ఎందుకు పెట్టారు? అని అంటే, "రమయతి ఇతి రామః" –ఎవడు, తనను చూచే వారి మనసుకు, కన్నులకు మధురమైనవాడై ఉండి, గొప్ప ఆనందాన్ని

కలిగిస్తాడో, రమింప చేస్తాడో, ఆ విధంగా ఆనందింపచేసేవానికి "రామః" అని పేరు. రాముని మనం కంటితో దర్శిస్తే చాలు, అతని రూపం మన కంటిలో ఎల్లప్పుడూ మెదలాడుతుంది. ఆ రూపం మన మనసులో స్థిరంగా నిలచి ఉంటుంది. అది మనకు గొప్ప ఆనందాన్ని కలిగిస్తుంది. " రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్ (తన రూపంలో కల ఉదారమైన గుణాలతో మన మనసును, చిత్తాన్ని అపహరించేవాడు) అని, " రామః కమలపత్రాక్షః సర్వసత్వమనోహరః" (రాముడు, తామర పువ్వుల రేకులవంటి కన్నులను కలిగినవాడు, ఆ నేత్రసౌందర్యంతో ప్రాణుల అందరి మనసులను హరించేవాడు) అని ఈ విధంగా వాల్మీకి మహర్షి విషయాన్ని తెలియజేశాడు.

ఇటువంటి, మనసుకు, నేత్రాలకు ఆనందాన్ని కలిగించే అందమైన రూపాన్ని కలిగిన రామునకు కల రామనామానికి దానికి తగిన అందమైన ద్రావిడనామం ఏమి? ఈ విధమైన నామాన్ని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలోని 12వ పాశురంలో "తెన్నిలంగై క్కోమానై చ్చెற்ற మనతుక్కినియానై" (దక్షిణ దిక్కులో ఉండే లంకనగరానికి అధిపతి అయిన రావణుని సంహరించిన మనసుకు చాలా మధురమైనవాడు) అని ప్రయోగించారు. ఇది ఎంత అందమైన ద్రావిడీకరణమో మనం గమనించవచ్చు.

ఇంతకు ముందే, రాముని రూపం దానిని దర్శించినవారి నేత్రాలను ఆకర్షించి, తద్వారా వారి మనసులో నిలచి, వారికి గొప్ప ఆనందాన్ని కలిగిస్తుంది, అందువల్ల ఆ స్వామికి "రామః " అనే పేరు అన్వర్థమైనది – అనే సంగతిని ప్రస్తావించడం జరిగింది. అయితే, ఇక్కడ గోదాదేవి అనుగ్రహించిన సూక్తిలో ఒక విశేషం ఉన్నది. రామశబ్దానికి సరి అయిన "మనత్తుక్కు ఇనియాన్" అనే ద్రావిడ నామాన్ని ప్రయోగించడానికి ముందు కొన్ని పదాలను గోదాదేవి ప్రయోగించినది.

“రామః– మనత్తుక్కినియాన్”

శ్రీరాముడు మనసుకు మధురమైనవాడు కావడానికి కారణం ఏమి? అనే విషయాన్ని ఈ పదాలు మనకు తెలుపుతున్నాయి.

ఆ పదాలు ఏమి అంటే, “ తెన్నిలంగై క్కోమానై చ్చెற்ற. “ అనే పదాలు. వీటికి దక్షిణ దిక్కులో ఉండే లంకానగరానికి అధిపతి అయిన రావణుని సంహరించినవాడు– అని, అందమైన లంకానగరానికి అధిపతి అయిన రావణుని సంహరించినవాడు – అని అర్థం. ఈ పదాలు ఏ అర్థాన్ని తెలుపుతున్నాయి? అని అంటే, రాముడు ఎందుకు మనస్సుకు ప్రియమైనవాడు అవుతున్నాడు? అనే కారణానికి తగిన సమాధానాన్ని ఇవి వివరిస్తున్నాయి. శ్రీరాముని ఆశ్రయించిన, అతనినే శరణంగా భావించిన ప్రపన్నురాలు, సీతాదేవి. “అతడు తప్పక వచ్చి తనను రక్షిస్తాడు “ అని ఆమె నమ్మినది. ఈ విషయాన్ని హనుమంతునితో ఆమె చెప్పినట్లుగా మనకు సుందరకాండలో గోచరిస్తుంది. “శరై స్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్ధనః, మాం నయేద్యది కాకుత్స్థః తత్తస్య సదృశం భవేత్” (తన బాణాలతో లంకానగరాన్ని అంతటినీ నిండించి, శత్రువుల బలాన్ని నశింప చేసే స్వభావాన్ని కలిగిన రామచంద్రుడు, నన్ను తిరిగి తీసుకొని వెడితే, అది అతనికి తగినదై ఉంటుంది) అనేది ఈ శ్లోకంలోని భావం. ఈ విధంగా ఆశపడిన, నమ్మిన సీతాదేవి ఆశకు, నమ్మకానికి అనుగుణంగానే శ్రీరాముడు అనేక ప్రయాసలను ఓర్చి, సుగ్రీవునితో సఖ్యం చేసి, వానరవీరులను సీతాన్వేషణ కోసం పంపించి, ఆమె జాడలను తెలుసుకొని, సముద్రంపై ఇతరులకు నిర్మించడానికి సాధ్యం కాని వారధిని కట్టి, అంతు లేని రాక్షస సైన్యాన్ని, ఎంతో మంది రాక్షస వీరులను, చివరకు అసమాన బలపరాక్రమాలను కలిగిన రావణుని సంహరించి సీతను కాపాడాడు. ఈ విషయాన్ని పైన ప్రస్తావించిన “తెన్నిలంగై క్కోమానై చ్చెற்ற” అనే ప్రయోగం

తెలియజేస్తున్నది. ఈ విధంగా “తనను రక్షిస్తాడు” అని నమ్మినవారిని అందరిని, తనను శరణాగతి చేసినవారిని అందరిని రక్షించే స్వభావాన్ని కలిగినవాడు, శ్రీరాముడు – అనే వాస్తవం పై ప్రయోగం ద్వారా తెలుస్తుంది. ఇటువంటి ఆశ్రితులను తప్పకుండా రక్షించే స్వభావాన్ని కలిగినవాని చరిత్రలను, అతని రూపాన్ని మనం మనస్సులో భావించినప్పుడు, ఆ భావన మనస్సుకు చాలా ఆనందాన్ని కలిగిస్తుంది కదా. అందువల్ల రామచంద్రుడు తన ఆకారంతో మన మనసుకు, నేత్రాలకు మనోహరమైనవాడై ఉండడమే కాకుండా, తన గుణాలతో, చరిత్రలతో కూడా మన మనసులకు ఆనందాన్ని కలిగించేవాడై, ఆ విధంగా ఉండే స్వభావాన్ని కలిగినవాడుగా భావించి, అతని రూపాన్ని ధ్యానం చేసినప్పుడు, నిరంతరం ధ్యానం చేసినప్పుడు, అటువంటి భావన విశేషం వల్ల ఆ స్వామియొక్క మనోహరమైన ఆకారం, లీలలు, గుణాలు అన్ని కూడా మన కంటి ముందు సాక్షాత్కరించి, మన మనసుకు, నేత్రాలకు ప్రత్యక్ష సమానాకారంగా గోచరం కావడంచేత, అవి కూడా ఆనందాన్ని కలిగిస్తాయి. ఈ విధంగా శ్రీరాముడు తన రూపంతోనే కాకుండా, తన చరిత్రలతో, గుణాలతో తనను దర్శించేవారికి ఆనందాన్ని కలిగించేవాడు – అనే విషయాన్ని పైన ప్రయోగించిన ప్రస్తావించిన గోదాదేవి సూక్తి మనకు తెలుపుతున్నది.

ఇక్కడ ఇంకొక అద్భుతమైన విషయంకూడా భావించదగినది ఉన్నది. శ్రీరామాయణంలోని “రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్” అనే ప్రయోగాన్ని మన పూర్వాచార్యులు చాలా అందంగా వ్యాఖ్యానించారు. దీనిని రెండు విధాలుగా వారు వివరించారు. ఒక వివరణ శ్రీరాముని అతిమానుషమైన, అసాధారణమైన రూపవైభవాన్ని తెలియజేస్తున్నదని తెలుపుతూ ఉండగా, వేరొక వివరణ శ్రీరాముని స్వరూపగుణాలను, రూపగుణాలను తెలియజేసేదిగా ఉన్నది.

"రామః– మనత్తుక్కినియాన్"

ముందుగా, శ్రీరాముని రూపగుణవైభవాన్ని తెలియజేసే వివరణ చూద్దాం. పై వాల్మీకి ప్రయోగంలోని "రూపౌదార్యగుణైః" అనే ప్రయోగానికి, రూపంలోని ఉదారతను తెలిపే "సౌందర్యం, లావణ్యం, మార్దవం, సౌగంధ్యం మొదలైన గుణాలతో" అని అర్థం చెప్పి, అటువంటి అందమైన రూపాన్ని కలిగిన శ్రీరాముని దర్శనం ముందుగా కన్నులకు గోచరమైనప్పుడు, అది చూచేవారి కన్నులను ఆకట్టుకొని, తద్వారా మనసులో శ్రీరాముని రూపం స్థిరంగా నిలిచేటట్లు చేసి, ఎల్లప్పుడూ నేత్రాలను, మనస్సును తన వశం చేసుకుంటుంది –అనే అర్థాన్ని తెలియజేశారు. ఈ వివరణలో– శ్రీరాముని రూపమే ముందు కన్నులను, తరువాత మనసును అపహరిస్తున్నది – అని అర్థం. ఇది శ్లోకంలోని "దృష్టిచిత్తాపహారిణమ్" శ్రీరాముడు తన గొప్పదైన రూపగుణాలతో దృష్టిని, మనసును అపహరించేవాడు – అనే క్రమానికి అనుగుణంగా ఉన్నది.

ఇక రెండవ సమన్వయం ఏమంటే, " రూపౌదార్యగుణైః " అనే ప్రయోగంలోని గుణశబ్దాన్ని రూపశబ్దంతోను, ఔదార్యశబ్దంతోను, రెండిటిలోనూ అన్వయించి, సౌందర్యం లావణ్య మొదలైన రూపగుణాలతో నేత్రాలను, ఔదార్యం, సౌశీల్యం సౌలభ్యం మొదలైన ఆత్మగుణాలతో, మనస్సును ఆకర్షించేవాడు – అని అర్థం చెప్పారు.

ఇక, శ్రీరామాయణంలోని "రామః కమలపత్రాక్షః సర్వసత్వమనోహరః" అనే రెండవ సూక్తిని గమనించినప్పుడు, శ్రీరాముడు తామర పూల రేకులవంటి నేత్రాలను కలవాడు కనుక, అందరి ప్రాణుల మనస్సులను హరించేవాడు – అనే అర్థం దీనికి వస్తుంది. దీనిని గమనిస్తే, రూపసౌందర్యం ముందుగా కన్నులను ఆకర్షించి ఆ తరువాత మనసును ఆకర్షిస్తుంది కనుక, ఇక్కడ రాముని నేత్రసౌందర్యం అందరి మనసులను ఆకర్షించి, అపహరిస్తుంది –అని అంటే, ముందుగా ఆ సౌందర్యం నేత్రాలను ఆకర్షించి, కన్నుల ద్వారా మనస్సును

ఆకర్షిస్తున్నది – అనే అర్థాన్ని గ్రహించవలసి ఉంటుంది. కన్నులకు ముందుగా గోచరించేది రూపం దా. అందువల్ల ఇక్కడకూడా నేత్రాలను, మనస్సును రాముడు తన రూపంతో ఆకర్షిస్తున్నాడు – అనే అర్థం వస్తుంది.

ఇక, ఈ రెండు శ్రీరామాయణ సూక్తులలోని అర్థాన్ని పైన ఉదాహరించిన గోదాదేవి ప్రయోగం తెలుపుతున్నది – అనే విషయాన్ని గమనిద్దాం. "తెన్నిలంగై క్కోమానై చ్చెற்ற மனతుక్కినియానై" అనే గోదాదేవి ప్రయోగంలోని " మనత్తుక్కినియాన్" అనే దానిని "ఇనియాన్, మనత్తుక్కినియాన్ " అని పర్యక్రమంలో గ్రహించి అర్థాన్ని గ్రహించవచ్చు. ముందుగా, "ఇనియాన్" అనే పదాన్ని గ్రహిస్తే, దీనికి "మధురమైనవాడు " అని అర్థం. అంటే, నేత్రాలను ఆకర్షించే అందమైన రూపాన్ని కలవాడు – అని దీని తాత్పర్యం. ఆ తరువాత, "మనత్తుక్కినియాన్" అనే భాగాన్ని గ్రహిస్తే, " మనత్తుక్కు" అనే పదసాహచర్యంవల్ల, దీనికి "తన వాత్సల్యం, శీలం మొదలైన ఆత్మగుణాలతో మనసుకు మధురమైనవాడు", అని తాత్పర్యం. ఈ విధంగా "మనత్తుక్కినియాన్" అనే ప్రయోగం నేత్రాలకు మనస్సుకు కూడా మధురమైనవాడు – అనే అర్థాన్ని తెలుపుతున్నది. ఈ ప్రయోగానికి ముందు ఉన్న "తెన్నిలంగై క్కోమానై చ్చెற்ற" (దక్షిణ దిక్కులో ఉండే అందమైన లంకానగరానికి అధిపతి అయిన రావణుని సంహరించినవాడు) అనే ప్రయోగం "మనత్తుక్కు ఇనియాన్" అనే ప్రయోగార్థాన్ని వివరిస్తున్నది. ఈ విధంగా గోదాదేవి సూక్తి పైన ఉదాహరించిన శ్రీరామాయణంలోని రెండు సూక్తులలోని అర్థాన్ని అనుసంధిస్తున్నట్లుగా ఏర్పడినది.

రామనామానికి ఇది ఎంతటి అందమైన నిర్వచనం! ఎంతటి అందమైన వివరణం! శ్రీరామాయణసూక్తులకు ఎంతటి మనోహరమైన అనువాదం.



# 5. లక్ష్మణః – "నప్పిన్నై"

దశరథునకు సుమిత్ర అనే భార్యవలన జన్మించిన కుమారులు ఇద్దరు. వారిలో పెద్ద కుమారుడు లక్ష్మణుడు, రెండవ కుమారుడు శత్రుఘ్నుడు. వీరు ఇద్దరూ కవలలు. ఆశ్లేషానక్షత్రంలో జన్మించారు.

దశరథుని పుత్రులకు వశిష్ఠుడు నామకరణం చేసేటప్పుడు, అతడు బ్రహ్మ ఋషి కనుక, వారి అవతార రహస్యాలను ప్రయోజనాలను తెలిసినవాడు కనుక, వారి వారి అవతార ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని వారికి పేర్లను పెట్టాడు. ఆ క్రమంలో సుమిత్ర పెద్ద కుమారునకు లక్ష్మణుడు అని నామకరణం చేశాడు. ఈ విధంగా లక్ష్మణునకు లక్ష్మణుడు అనే పేరును వశిష్ఠుడు పెట్టడానికి గల కారణాన్ని శ్రీరామాయణంలో మహర్షి వాల్మీకి "లక్ష్మణో లక్ష్మిసంపన్నః " లక్ష్మణుడు లక్ష్మితో కూడుకొని ఉండేవాడు) అని, "లక్ష్మణో లక్ష్మివర్ధనః" (లక్ష్మణుడు సంపదను అభివృద్ధి చేసేవాడు) అనే తన సూక్తులద్వారా తెలియజేశాడు.

ఇక్కడ లక్ష్మిశబ్దంచేత చెప్పబడిన సంపద లౌకికమైన సంపద కాదు, అలౌకికమైన, నిత్యమైన, జీవాత్మస్వరూపానికి అనుగుణమైన భగవంతుని కైంకర్యం అనే సంపదయే. దీనిని ఈ అర్థాన్ని గోవిందరాజులు తమ శ్రీరామాయణ వ్యాఖ్యానంలో తెలియజేశారు. "లక్ష్మిసంపన్నః " అనే పదాన్ని వ్యాఖ్యానిస్తూ " లక్ష్మిసంపన్న ఇత్యనేన లక్ష్మణ శబ్దార్థ ఉక్తః" (లక్ష్మీసంపన్నః –అనే పదం ద్వారా లక్ష్మణ శబ్దార్థం చెప్పబడింది) అని, " లక్ష్మివర్ధనః" అనే ప్రయోగాన్ని "కైంకర్యసంపద్వర్ధకో లక్ష్మణః" (కైంకర్య మనే సంపత్తును అభివృద్ధి చేసేవాడు లక్ష్మణుడు) అని ఆ వ్యాఖ్యానంలో వివరింపబడడం గమనించవచ్చు. అదేవిధంగా,

ఈ అర్థం ఆళ్వారుల దివ్యప్రబంధాలలోను సూక్తులలోను పూర్వాచార్యుల వ్యాఖ్యానాలలోనూ మనం స్పష్టంగా గమనించవచ్చు.

పై రెండు శ్రీరామాయణ సూక్తులను మన పూర్వాచార్యులు పలుచోట్ల ప్రమాణీకరించి, వీటిలోని అర్థవిశేషాలను తెలియజేశారు. ఈ రెండు సూక్తులలోని, "లక్ష్మణో లక్ష్మిసంపన్నః "అనే సూక్తిలో మన పూర్వాచార్యులకు విశేషమైన దృష్టి ఉన్నది. ఈ సూక్తిలోని "లక్ష్మి" అనే పదాన్ని, "సంపన్నః " అనే పదాన్ని వివరించేటప్పుడు, వారు అనుగ్రహించిన విశేషమైన, విలక్షణమైన అర్థాలు చాలా గమనించదగినవి. ఈ ప్రయోగాన్ని వివరిస్తూ, "లక్ష్మి, పన్నః, సంపన్నః" అనే పదాలకు వారు తెలిపిన అర్థాలు చాలా అందమైనవి. ఆ విధంగా వారు తెలియజేసిన ఆ అర్థాలకు మూలం వేదాంతంలో నిర్వచింపబడిన జీవస్వరూపం, దానిని అనుసరిస్తూ అనుగ్రహించిన ఆళ్వారుల శ్రీసూక్తులే అనే విషయంకూడా గమనించదగినది.

ముందుగా, ఈ మూడు పదాలకు నిఘంటువు అనుసరించి లోకంలో వ్యవహారాలను అనుసరించి ఉండే అర్థాలను గమనిద్దాం ముందుగా లక్ష్మిశబ్దాన్ని గ్రహిద్దాం. సంపద అనే అర్థాన్ని, విష్ణువుయొక్క పత్ని అనే అర్థాన్ని ఇచ్చే లక్ష్మీశబ్దానికి నిఘంటువులు వ్యుత్పత్తి అర్థాన్ని తెలుపుతూ, "లక్ష్యతే అనయా, లక్షయతి నీతిజ్ఞమ్, లక్ష –దర్శన అంకనయోః" అని ఈ పదాన్ని నిర్వచించాయి. అంటే, దీనివల్ల లోకంలో ఒక వ్యక్తి గుర్తింపబడతాడో, దానికి లక్ష్మి అని పేరు – అని అర్థం. ఈనాటికి దీనిని శాస్త్రంలో, లోకంలో మనం గమనిస్తూనే ఉన్నాం.

పురుషసూక్తం పరతత్త్వ స్వరూపుడైన నారాయణుని గుర్తించే లక్షణాలను తెలుపుతూ, " హ్రీ శ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ" (భూదేవి, లక్ష్మీదేవి నీకు పత్నులు) అని పరతత్త్వాన్ని గుర్తించే లక్షణంగా లక్ష్మీదేవిని కలిగి ఉండడాన్ని చెప్పింది. ఇది శాస్త్రంలో ప్రసిద్ధమైన విషయం. దీనిని వేదవిదులైన మహర్షులు " సర్వేషా మేవ లోకానాం పితా

మాతా చ మాధవః" (అన్ని లోకాలకు తల్లి, తండ్రి లక్ష్మికి భర్త అయినవాడే) అన్ని మొదలైన సూక్తులతోనూ, వీరి మార్గాన్ని అనుసరించి ప్రబంధాలను అనుగ్రహించిన అళ్వార్లు అందరూ " తిరుమాలే! నాన్ ఉనక్కు పழ అడియేన్ " (లక్ష్మీపతీ! , నీకు నేను అనాదిగా దాసుడను) అన్ని మొదలైన పాశురాలద్వారా ఈ అర్థాన్ని అనుసంధించారు. ఇది లక్ష్మిశబ్దానికి "నారాయణనకు పత్ని "అనే అర్థంలోని సమన్వయం.

ఇక, లోకంలో విషయానికి వస్తే, ఎవరికి లక్ష్మి అనే శబ్దంచేత చెప్పబడే సంపద ఉంటుందో, అతనికి గుర్తింపు ఉంటుంది – అనేది సర్వత్రా ప్రసిద్ధమైన విషయం. ఇప్పటికీ సుమారు 2000 సంవత్సరాల ముందువాడుగా భావింపబడే భర్తృహరి నీతి శతకంలో " యస్యాస్తి విత్తం స నరః కులీనః, స పండితః, స శ్రుతవాన్, గుణజ్ఞః, స ఏవ వక్తా, స చ దర్శనీయః, సర్వే గుణాః కాంచన మాశ్రయంతే" (ఎవనికి డబ్బు ఉన్నదో, అతడు మంచి వంశంలో పుట్టినవాడు, అతడు పండితుడు, అతడే విద్యావంతుడు, అతడే మంచి చెడ్డలను తెలిసినవాడు, అతడే మంచి వక్త, అతడే అందమైనవాడు. అన్ని గుణాలు ధనం ఉండేవానిని ఆశ్రయిస్తాయి) అని అన్నాడు అందువల్ల అనాదిగా ధనం కలిగిన వానికి సంఘంలో, సమాజంలో ఉండే స్థానం ఎటువంటిదో తెలుస్తున్నది కదా.

ఇక లక్ష్మిశబ్దానికి నారాయణుని పత్ని, ధనం – అనే అర్థాలే కాకుండా, సాహిత్యంలో, శోభ అనే అర్థం కూడా ప్రయోగంలో ఉన్నది. ఇది కూడా అంతటా స్పష్టంగా గమనించదగినది ఎందుకంటే, ఇంతకు ముందు చెప్పినట్లుగా, ధనం కలిగినవానికే మనసులో ఉత్సాహం ఉంటుంది. దానివల్ల అతని రూపంలో శోభ ఉంటుంది. శారీరకమైన, మానసికమైన ప్రకాశం ధనంవల్ల ఏర్పడుతున్నది అనేది లోక సిద్ధం.

వీటినిబట్టి మనకు ఏమి ఏర్పడుతున్నది? అని అంటే, లోకంలో ఒకనికి రూపంలో కానీ, స్వరూపంలో కానీ, శోభలో కానీ, ఇంకా ఏ విధమైన విషయంలో కానీ, కలిగే గుర్తింపు, గౌరవం, కాంతి అన్నీ కూడా ధనం వల్లనే సిద్ధిస్తున్నవి అని ఏర్పడుతున్నది.

అయితే, ఈ విధంగా ఉండే అర్థాలను అన్నిటిని జీవస్వరూప విషయంగా మనం సమన్వయించుకుని అర్థాలను గ్రహించినప్పుడు, వేరు విధంగా ఉండే తాత్పర్యాలు సిద్ధిస్తాయి. దానిని కొంచెం చూద్దాం.

వేదాంతశాస్త్రం తెలియజేసిన జీవస్వరూపంప్రకారం, జీవుడు భగవంతుడైన నారాయణుడు శేషమై ఉన్నాడు. ఈ స్థితి ఇప్పటిది కాదు. అనాదిగా జీవుడు భగవంతునకు శేషమై ఉన్నాడు. అతని దేహం, ఇంద్రియాలు, ఆత్మ అన్నీ కూడా భగవంతునకు శేషమే. అతని ఆనందానికి ఉపయోగపడవలసినవే. ఆ స్వామి కైంకర్యంకోసం వినియోగించవలసినవే. "విచిత్రా దేహసంపత్తి రీశ్వరాయ నివేదితుమ్, పూర్వమేవ కృతా బ్రహ్మన్! హస్తపాదాదిసంయుతా" (బ్రహ్మా! చేతులు, కాళ్లు మొదలైన అంగాలతో కూడుకుని ఉండే చాలా చిత్రమైన దేహసంపద అనాదిగా భగవంతునిచే, ఆ భగవంతుని సేవ కోసమే సృష్టింపబడింది) అనేది ప్రసిద్ధమైన ప్రమాణం.

ఇందువల్ల, భగవంతునకు చేసే కైంకర్యంవల్ల జీవునకు స్వరూప సిద్ధి, గౌరవం, శోభా, అన్నీ సిద్ధిస్తాయి. ఈ విషయాన్ని వేదమే స్పష్టంగా చెప్పింది. " అసన్నేవ స భవతి, అసత్ బ్రహ్మేతి చేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద సంత మేనం తతో విదురితి" (ఎవడు, భగవంతుడు లేడని, ఒకవేళ ఉన్నాడని తెలిసినా, భగవంతునకు తాను శేషం కాదని, భగవంతుని చేసే సేవ పరమార్థం కాదని భావిస్తాడో, అతడు లేనివాడే అవుతున్నాడు. అంటే అతనికి సత్త సిద్ధించదు. అతనిని సత్పురుషులు

ఉన్నవానినిగా గుర్తించరు. ఎవడు, భగవంతుడు ఉన్నాడు అని, అతడు తనకు శేషి అని, అతని కైంకర్యమే పరమపురుషార్థం అని తెలుసుకుంటున్నాడో, అతడే ఉన్నవాడు అవుతున్నాడు అంటే, సత్తను కలిగినవాడు అవుతున్నాడు. అటువంటి జ్ఞానిని సత్పురుషులు ఆదరిస్తారు) అని అంటూ ఈ విషయాన్ని వేదం తెలుపుతున్నది. దీనినిబట్టి జీవునకు స్వరూప సిద్ధి, పెద్దల వద్ద గౌరవం, శోభ అనేవి అంతా కూడా, భగవంతునకు తాను శేషం అని, ఆ స్వామికి చేసే సేవయే వరమార్థమని, అంటే, అదే సంపాదించదగిన సంపద అని భావించి, ఆ విధంగా ప్రవర్తించినపుడే అతనికే సిద్ధిస్తుంది – అని ఏర్పడుతున్నది.

ఇందువల్ల, తత్వదృష్టిలో చూస్తే, జీవునకు నిజమైన ధనం, నిజమైన లక్ష్మి, భగవంతుని కైంకర్యమే అనేది స్పష్టం అవుతున్నది. ఈ అర్థమే ప్రకృతంలో వాల్మీకి మహర్షి పలికిన సూక్తులలో కూడా గ్రహించదగినది.

ఇది లక్ష్మీపదానికి ప్రస్తుతంలో గ్రహించదగిన అర్థం.

ఇక " పన్నః" రెండవ పదానికి వస్తే, ఈ పదానికి "సంపదను పొందినవాడు", అని అర్థం. పత్తిః అంటే, సంపద. దానిని పొందినవాడు కనుక, పన్నః అనబడుతున్నాడు. " పద్యతే ఇతి పత్తిః" (పొందబడేది కనుక పత్తిః అని చెప్పబడుతున్నది) అనే అర్థాన్ని ఇక్కడ పత్తిశబ్దానికి గ్రహించాలి. గత్యర్థధాతువునుండి ఉత్పన్నమైన "పత్తిః" అనే ఈ పదానికి, లోకంలో అందరిచేత ఆశపడి ప్రయత్నం చేసి. పొందబడేది ధనం అని అర్థం కనుక, ఈ అర్థాన్నే ఇక్కడ గ్రహించడం సముచితం. ప్రకృతంలో విషయం జీవునకు స్వరూపసిద్ధిని, గౌరవాన్ని, అందాన్ని కలిగించేది భగవంతుని కైంకర్యమే కనుక, దానిని ఇక్కడ గ్రహించి, పన్నః అంటే, భగవంతుని కైంకర్యాన్ని, అంటే, తనకు తగిన ధనాన్ని పొందినవాడు – అనే అర్థాన్ని గ్రహించాలి.

ఇప్పుడు, చివరిగా, మూడవది అయిన "సంపన్నః" అనే పదాన్ని గమనించి చూచినప్పుడు, ఇంతకు ముందు నిర్వచింపబడిన జీవుని స్వరూపానికి తగిన ధనమైన భగవత్కైంకర్యాన్ని చక్కగా పొందినవాడు, పరిపూర్ణంగా పొందినవాడు, నిలకడగా పొందినవాడు – అనే అర్థాన్ని గ్రహించాలి.

భగవంతుని కైంకర్యాన్ని పూర్ణంగా పొందడం అంటే ఏమి? చక్కగా పొందడం అంటే ఏమి? నిలకడగా పొందడం అంటే ఏమి? అనే ప్రశ్న వెంటనే వస్తుంది. దీనిని మన పూర్వాచార్యులు చక్కగా సమాధానించారు. "పన్నః" అంటే భగవంతుని పర్యంతమైన దాస్యాన్ని, అంటే, స్వరూపానికి అనుగుణమైన ధనాన్ని పొందినవాడు – అని, సంపన్నః అంటే, ఆ దాస్యాన్ని భాగవత, ఆచార్య పర్యంతంగా పొందడమని తాత్పర్యం. భగవంతుని దాస్యం ప్రథమపర్వాత్మకం. అంటే, మొదటి మెట్టులో ఉండే సంపద. అది భాగవత పర్యంతంగా, ఆచార్య పర్యంతంగా సిద్ధిస్తే, అది చివరి మెట్టువరకు సిద్ధించినట్లు అవుతుంది. అప్పుడే అది పరిపూర్ణం అవుతుంది, అప్పుడే అది నిలకడగా నిలిచేది అవుతుంది, అప్పుడే అది చక్కగా పొందినది అవుతుంది.

ఈ అర్థాన్నే ఇక్కడ "లక్ష్మిసంపన్నః" అనే పదానికి గ్రహించాలి – అని మన పూర్వాచార్యుల వివరణం. శ్రీరామాయణంలోని భగవచ్ఛేషభూతుడైన, భగవంతుని శేషత్వానికి ప్రతిరూపమైన లక్ష్మణుని స్వరూపాన్ని తెలియజేసే "లక్ష్మిసంపన్నః" అనే ఈ ప్రయోగంలోని తాత్పర్యార్థం ఇదే.

ఇక, లక్ష్మణుని స్వరూపాన్ని వర్ణించే "లక్ష్మణో లక్ష్మివర్ధనః " అనేవేరొక శ్రీరామాయణ సూక్తిని గ్రహిద్దాం. దీనికి "లక్ష్మిని, అంటే, భగవంతుని కైంకర్యాన్ని అభివృద్ధి చేసేవాడు" అని అర్థం. భగవంతుని కైంకరియాన్ని చరమ పర్వపర్యంతంగా, అంటే, పూర్ణంగా, చక్కగా, నిలకడగా కలిగి ఉండడంతో పాటు, ఆ సంపదను

అంతటా వ్యాపింప చేసేవాడు, దానిని అందరికీ పంచి పెట్టేవాడుగా ఉండడం కూడా జీవుని స్వరూపంలోకి చేరుతున్నదని దీనివల్ల తెలుస్తున్నది. ఇదికూడా జీవుని స్వరూపంలోకి అంతర్గతమై ఉన్నదని తెలుస్తున్నది. ఈ అర్థం “లక్ష్మిసంపన్నః” అనే ముందు ప్రస్తావించిన లక్షణం ద్వారా ధ్వనిస్తూ ఉన్నప్పటికీ, దీనిని ఈ రెండవ లక్షణం వివరిస్తున్నదని భావించవచ్చు.

ఇదే లక్ష్మణనామంలోని పరమార్థం. ఇదే లక్ష్మణునిద్వారా నిర్దేశింపబడే జీవుని స్వరూపం.

ఈ లక్ష్మణనామాన్ని ద్రావిడ భాషలోనికి గ్రహించినప్పుడు “ఇలక్కుమన్” అనే రూపాన్ని పొందుతుంది. ఇది సాధారణమైన రూపం. కానీ, ఈ నామాన్ని గోదాదేవి చాలా అందంగా అనువదించిన ప్రకారాన్ని ఇప్పుడు గమనిద్దాం.

శ్రీరామాయణంలో పై విధంగా నిర్వచింపబడిన లక్ష్మణనామాన్ని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలోని 12వ పాశురంలో “నల్చెల్వన్” అని అంటూ చాలా అందంగా అనువదించింది. ఈ ప్రయోగానికి “మంచి సంపదను కలిగినవాడు” అని అర్థం.

ఈ ప్రయోగంద్వారా పైన శ్రీరామాయణంలో నిర్వహింపబడిన జీవస్వరూపం తెలుపబడింది అనే విషయాన్ని మన పూర్వాచార్యులు తిరుప్పావై వ్యాఖ్యానాలలో వివరించారుకూడా.

శ్రీరామాయణంలోని “సంపన్నః” అనే పదాన్ని “పన్నః, అని, “సంపన్నః “అని పర్యక్రమంలో వివరించినట్లే, తిరుప్పావైలోని “నల్చెల్వన్” అనే ప్రయోగాన్నికూడా “శెల్వన్. నల్చెల్వన్ “ అని పర్యక్రమంలో వివరించాలి. శెల్వన్ అంటే, భగవత్పర్యంతంలోని కైంకర్యసంపదను కలవాడని, “నల్చెల్వన్” అంటే, భాగవత, ఆచార్యపర్యంగా, సిద్ధించిన, పరిపూర్ణమైన, నిలకడగా నిలచి ఉండే, లోకం

అంతా వ్యాపింప చేయగలిగిన, అందరికీ సంక్రమింప చేసే దాస్యాన్ని కలవాడని అర్థాన్ని గ్రహించాలి. అంతే కాదు, " నల్" విశేషణ ప్రయోగ సార్థక్యాన్ని లౌకికసంపద కంటే విలక్షణమైన సంపదను తెలుపుతున్నదనే అర్థంద్వారా కూడా గ్రహించవచ్చు. లౌకికమైన సంపద నిలకడగా నిలిచేది కాదు, పూర్ణంగా ఉండేది కాదు, అందరికీ పంచడానికి సాధ్యపడేది కాదు కదా. అంతేకాక, దానివల్ల కలిగే గొప్పతనం ప్రాకృతమైనది, అల్పమైనది, అశాశ్వతమైనది. జీవస్వరూపానికి విరుద్ధమైనది. కానీ, ఆచార్యపర్యంతంగా సిద్ధించిన దాస్యం అలౌకికమైనది, పూర్ణమైనది, స్థిరమైనది, జీవస్వరూపానికి అనుగుణమైనది. ఇటువంటి విశేషాలన్నీ ఇక్కడ ఈ విశేషణంద్వారా సిద్ధిస్తాయి.

మూవాయిరప్పడి వ్యాఖ్యానంలో శ్రీకృష్ణసూరి అనబడే పెరియ వాచ్చాన్ పిళ్లై పై ప్రయోగాన్ని వివరిస్తూ "ఒక సమయంలో లభించి, ఇంకొక సమయంలో లేకుండా పోయే లౌకికమైన సంపదవంటిది కాకుండా, నిలకడగా నిలచి ఉండే సంపద, ఇది". అంటే, శ్రీకృష్ణుని చరణాలలో నిరంతరంగా సేవ చేయడం అని అర్థం. "లక్ష్మణో లక్ష్మిసంపన్నః" అని చెప్పినట్లుగా భగవంతునకు సేవ చేయడం అనే లక్ష్మికదా, ఈ ఆత్మకు స్థిరంగా ఉండే సంపద. "ఊరుమ్ నాడుమ్ ఉలకముమ్ తన్నైప్పోల్ (తిరువాయ్ మొழி – 6 –7– 1) (ఊరు, పట్టణం, లోకం అంతా కూడా తనవలె ఉండేటట్లుగా, అంటే, తనవలె భగవంతుని సేవను చేసేవారై ఉండేటట్లుగా పరిణమింప చేసేవారు) అనే విధంగా తన వైష్ణవత్వంతో జగత్తును అంతటిని వైష్ణవత్వాన్ని కలిగినట్లుగా చేయడం) అని వివరించడం ఇక్కడ గమనించవచ్చు.

ఇటువంటి వివరణ ఆఱాయిరప్పడి వ్యాఖ్యానంలో, నాలాయిరప్పడి, ఈరాయిరప్పడి వ్యాఖ్యానాలలో కూడా గోచరిస్తుంది.

లక్ష్మణః – “నఞ్చీల్వన్”

పైన ప్రస్తావించిన “లక్ష్మణో లక్ష్మిసంపన్నః” అనే శ్రీరామాయణ ప్రమాణాన్ని నంబిళ్ళై మొదలైన మన పూర్వాచార్యులు మరికొన్ని దివ్యప్రబంధసూక్తులను వ్యాఖ్యానం చేసేటప్పుడుకూడా ప్రమాణీకరించి, ఈ విశేషార్థాలను అనుగ్రహించడం ఇక్కడ స్మరించదగిన విషయం. ఉదాహరణకు తిరువాయ్ మొழி ప్రబంధంలోని (3–7–1) అనే పాశురానికి నంబిళ్ళై అనుగ్రహించిన ఈడువ్యాఖ్యలో, పెరియాళ్వార్ తిరుమొళిలోని అనే పాశురానికి తిరువాయ్ మొழி ప్పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యానంలోను ఈ వివరాలను గమనించవచ్చు.

★★★★★

# 6. శ్రీభాష్యం – శ్రీభాష్యకారులు

శ్రీ పెరుకరణి స్వామి ద్రావిడ వ్యాసం ఆధారంగా

"ఇరుళ్ తరు మా ఞాలమ్" (అజ్ఞానాన్ని కలిగించే విశాలమైన భూమి) అయిన ఈ ప్రపంచంలో ఉండే ప్రజలు అందరూ బాగుపడాలని కోరిన భగవంతుడు వేదం అనే దీపాన్ని వెలిగించి ఇచ్చాడు. పగటివేళ లోకంలో ప్రకాశించే సూర్యుని కాంతి బయట ఉండే వస్తువులను మాత్రం వ్యక్తం చేసి, బయట ఉండే చీకటిని లేకుండా చేయగలదు తప్ప, మనస్సులో ఉండే చీకటిని పోగొట్టగలిగినది, ఇంద్రియాలకు గోచరం కాని భగవత్తత్వాన్ని వ్యక్తం చేయగలిగినది కాదు. వేదం అనేద దీపం అయితే, అన్ని విధాలైన చీకట్లను తొలగించగలదు. దీని సహాయంతోనే ఆత్మ స్వరూపాన్ని, భగవంతుని స్వరూపాన్ని, అచేతనతత్వస్వరూపాన్ని తెలుసుకొని మంచి గతిని మనం పొందగలం.

వేదం అనేద దీపాన్ని భగవంతుడు మనకు తన సహజమైన కరుణ వల్ల అనుగ్రహించినప్పటికీ, అందులో ఉండే వాస్తవమైన అర్థాన్ని తెలుసుకొని, మంచి గతిని పొందగలిగినవారు కొందరే ఉన్నారు. మరి కొందరు అందులోని అర్థాన్ని సరిగా తెలుసుకోకుండా, వేరే విధమైన అర్థాలను చెప్పి, వాటిని ప్రచారం చేసి, దీపంలో పడి నశించిపోయే దీపపు పురుగుల వలె, ఆ దీపపుజ్వాలలలోనే పడి మాడి మసి అయిపోతున్నారు.

వేదం అనేది మూడు భాగాలుగా ఏర్పడి ఉన్నది. కర్మకాండం, దేవతాకాండం, బ్రహ్మకాండం అని ఈ మూడు భాగాలకు పేర్లు. మొదటి కాండం అయిన కర్మకాండంలోని అర్థాన్ని ప్రస్తావించి వివరించడం కోసం జైమిని మహర్షి సూత్రాలను కొన్నిటిని రచించారు. దేవతాకాండం అనే రెండవ ఖండాన్ని

వివరించడం కోసం కాశకృత్స్నులు అనే మహర్షి వేరు సూత్రాలను రచించారు. వేదంలోని మూడవ భాగం అయిన బ్రహ్మకాండం అనే ఉపనిషద్భాగంలోని అర్థాలను వివరించడం కోసం వేదవ్యాసులు అనే మహర్షి బ్రహ్మసూత్రాలను రచించారు.

త్రయీ అని చెప్పబడే వేదానికి మంగళసూత్రంవంటి సూత్రాలను అమృతం అని పెద్దలు వ్యవహరించారు. "పారాశర్యవచఃసుధామ్" అని అన్నారు, భగవద్రామానుజులవారు. లోకంలో పాణిని సూత్రాలు, వాత్స్యాయన సూత్రాలు, గౌతమ సూత్రాలు అని ఈ విధంగా మహర్షులు అనేకులు రచించిన సూత్రాలు చాలా ఉన్నాయి. అయినప్పటికీ, సూత్రాలు అనే నిర్విశిష్టమైన ప్రయోగాన్ని వింటే, ఆ పదంతో బ్రహ్మసూత్రాలే ఎక్కువగా చెప్పబడతాయి. సూత్రశబ్దంతో పెద్దలు బ్రహ్మసూత్రాలనే వ్యవహరిస్తారు.

ఇంతకు ముందు చెప్పబడిన పాణినిసూత్రాలు, గౌతమ సూత్రాలు మొదలైన, పలు శాస్త్రాలకు సంబంధించిన సూత్రాలకు పలువురు మహనీయుల భాష్యాలను రచించారు. వారికి భాష్యకారులు అని పేరు. అయినప్పటికీ, బ్రహ్మసూత్రాలకు భాష్యం రచించినవారికే ప్రసిద్ధంగా భాష్యకారులు అనే వ్యవహారం ప్రచురంగా కనిపిస్తుంది. మిగిలిన శాస్త్రాలకు సంబంధించిన సూత్రాలకు భాష్యం రచించినవారిని మహాభాష్యకారులు, అని న్యాయ సూత్ర భాష్యకారులు అని భాష్యకారశబ్దానికి ముందు ఒక విశేషణాన్ని ప్రయోగించి వ్యవహరించడం జరుగుతున్నది.

ఇంతే కాక, మిగిలిన భాష్యాలకు భాష్యం అని మాత్రమే పేరు. కానీ, భగవద్రామానుజులవారు అనుగ్రహించిన బ్రహ్మసూత్ర భాష్యానికి శ్రీభాష్యం అని ప్రసిద్ధి. వారిని కేవలం భాష్యకారులు అనే మాత్రమే వ్యవహరించే సంప్రదాయం లేదు. శ్రీభాష్యకారులు అని వారికి నామం. అందువల్ల శ్రీభాష్యం అని, శ్రీభాష్యకారులు అని

మన సంప్రదాయానికి చెందిన బ్రహ్మసూత్రభాష్యాన్ని, దానిని అనుగ్రహించిన మన రామానుజులను గౌరవంతో నిర్దేశించి వ్యవహరించడం సంప్రదాయం.

బ్రహ్మసూత్రాలు, అని బ్రహ్మసూత్రభాష్యం అని ఒక్కొక్క విశేషణాన్ని చేర్చి వ్యవహరించవలసిన ఆవశ్యకత లేదు. సహస్రనామం అని అంటేనే ఆ ప్రయోగం శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రాన్ని నిర్దేశిస్తుంది. భాగవతం అంటే, శ్రీకృష్ణుని కథను తెలిపే శ్రీమద్భాగవతాన్ని మాత్రమే అది తెలుపుతుంది. ఆ విధంగానే ఇక్కడకూడా తెలియదగి ఉన్నది.

చాలా విశాలమైన హృదయాన్ని కలిగిన శ్రీరామానుజులు బ్రహ్మసూత్రాలకు చాలా గంభీరమైన అర్థాలతో, వేదాలలో ఉండే అర్థాలను మనస్సులో పెట్టుకుని చాలా అందంగా శ్రీభాష్యాన్ని అనుగ్రహించారు. ఈ శ్రీభాష్యాన్ని జనులు అందరూ గొప్పగా గౌరవించి పలుకుతున్నారు, చాలా ఆదరంతో కీర్తిస్తున్నారు అనేది మాత్రమే కాక, వేరు మతాల కోసం సంబంధించినవారు కూడా దీనిని చాలా ఆదరంతో పొగడుతున్నారు.

ఇందులో వాస్తవానికి ఏ విధమైన దోషం లేకపోయినప్పటికీ, ఏదో ఒక ఆభాసరూపమైన దోషాన్ని చెప్పి, "దీనిని ఖండించాము"అని లోకానికి తెలియజెప్పడం కోసం వారు రచించిన తమ గ్రంథాలలో, ఈ భాష్యకారుల సూత్రభాష్యాన్ని అనువదించడానికి ప్రస్తావించి చెప్పేటప్పుడు, "శ్రీమద్భాష్యంలో, శ్రీభాష్యంలో" అని దీనిని నిర్దేశిస్తున్నారు. అంటే, వారి దృష్టిలోకూడా ఈ శ్రీభాష్యం చాలా గౌరవించదగినదిగా ఉన్నదన్న మాట.

ఒకడు తన తల్లి విషయంలో ఏదో కారణంచేత ద్వేషాన్ని పొందాడు. అది చాలా పెరిగిపోయింది. ఒకానొక సమయంలో ఆ తల్లిని కొట్టడానికి కూడాష అతడు సిద్ధమయ్యాడు. తన చేతిలో కర్రను పట్టుకొని వచ్చాడు. అప్పుడు అతని

కాలికి దెబ్బ తగిలింది. చాలా నొప్పి కలిగింది. ఆ నొప్పిని అతడు భరించలేక, ఆ సమయంలో అతడు, తన తల్లిని కొట్టడంకోసం కర్రను పట్టుకొని ఆమె పైకి వచ్చినప్పటికీ, "అమ్మా! " అని అంటూ ఆమె పేరునే ఉచ్చరిస్తున్నాడు. అతని నోటిలో "అమ్మా! " అనే పదమే వచ్చింది. ఈ విధంగా శ్రీభాష్యాన్ని దూషించాలని, నిందించాలని ప్రయత్నించి సిద్ధపడినవారు కూడా, ఈ దివ్యగ్రంథాన్ని చాలా గౌరవించి, శ్రీభాష్యం, అని శ్రీమద్భాష్యం –అని చెబుతున్నారు.

అనాది అయిన వేదంచేత కీర్తింపబడే భగవంతుని దూషించాలనే భావించిన దుర్యోధనుడు, శ్రీకృష్ణుడు అతని దగ్గరకు దూతగా వచ్చినప్పుడు "అవశాః ప్రతిపేదిరే" (ఆరవశ్యాన్ని పొంది, శ్రీకృష్ణుని సమీపించారు) అనే రీతిలో తనకు తెలియకుండానే శ్రీకృష్ణుని చూచి లేచి, నిలుచుని, ఆ స్వామికి నమస్కారం చేశాడు ఆ విధంగానే, భగవంతుని, అతని కళ్యాణ గుణాలను నిరూపించి కీర్తించడం కోసం శ్రీభాష్యాన్ని దూషించాలనే ప్రయత్నం చేసినవారుకూడా దానిని శ్రీభాష్యం అనే చాలా గౌరవంగానే తమ గ్రంథాలలో ప్రస్తావించి నిర్దేశిస్తారు. శ్రీరాముని దూషించాలని మనస్సులో భావించి పలుక బోయిన శూర్పణఖ వలె, మంగళాశాసనమే చేస్తారు, అంతే ఈ విధంగా ఇంతటి గొప్ప గౌరవాన్ని కలిగినది, శ్రీభాష్య మహా గ్రంథం

విదేశాలలో ఉండేవారు కూడా సంస్కృత భాషలో ఉండే శ్రీభాష్యాన్ని అనువదించి చదివి చూచారట. ఈ విధంగానే, శంకర భాష్యం, ద్వైత భాష్యం మొదలైనవాటిని కూడా వారు చదివారు. తరువాత మన శ్రీరామానుజులు అనుగ్రహించిన శ్రీభాష్యమే లోకవ్యహారానికి చాలా దగ్గరలో ఉన్నందువల్ల, అది చాలా గొప్పది అని నిశ్చయించి, దానిని కీర్తించారు.

శ్రీభాష్యం – శ్రీభాష్యకారులు

శ్రీభాష్యమహాగ్రంథం ఉపనిషత్తులలో ఉండే అర్థాలకు ఏ విధమైన విరోధం లేకుండా, భగవంతుని అభిప్రాయానికి అనుగుణంగా ప్రస్తావింపబడినది అయినందువల్ల, మొదటి శ్లోకంనుండి ఆరంభించి, చివరి పంక్తివరకు ఒక్కసారి పారాయణం చేస్తేనే చాలు, అది చాలా పరిశుద్ధిని కలిగిస్తుంది. దానివల్ల మనం అన్ని పాపాలనుండి విముక్తులం అవుతాం. శ్రీమద్రామాయణం, శ్రీమద్భగవద్గీత మొదలైన పుణ్య గ్రంథాలను పారాయణం చేయడం వల్ల ఎటువంటి ప్రయోజనం కలుగుతుందో, అంతటి ప్రయోజనం దీని పారాయణంవల్ల కలుగుతుంది. మహాపాపాలకు కూడా దీనిని పారాయణం చేయడంవల్ల ప్రాయశ్చిత్తం లభిస్తుంది. గంగ మొదలైన పుణ్యనదీజలాలలో విశేష దినాలలో సంకల్పాన్ని చేసికొని, స్నానం, దానం చేస్తే కలిగే ఫలం ఎటువంటిదో, అంతటి ఫలాన్ని, ఇది, సులభంగా మనకు కలిగిస్తుంది.

శ్రీకృష్ణుడు తన అవతారాన్ని పూర్తిచేసి చివరలో స్వస్థానాన్ని చేరాడు. అప్పుడు తన కాంతిని తనను ప్రతిపాదించే శ్రీభాగవతంలో నిక్షేపించాడట "స్వకీయం యద్భవేత్ తేజః తచ్చ భాగవతే న్యధాత్" అనేది దీనికి ప్రమాణం. ఇదేవిధంగా శ్రీరాముడు తన కాంతిని శ్రీమద్రామాయణంలో నిక్షేపించాడట. ఈ విధంగానే, కుశలవులు శ్రీరామాయణాన్ని గానం చేసేటప్పుడు, ఎవరికి తెలియకుండా శ్రీరాముడు తాను కూర్చున్న సింహాసనాన్ని వదలి పెట్టి, సభకు మధ్యలోకి వచ్చి కూర్చున్నాడు. దీనికి ఏమి అర్థం? అని గమనించి చూస్తే, " నేను అవతారాన్ని పూర్తి చేశాను. నన్ను పూజించి పొందే ఫలం ఏదైతే ఉన్నదో, దానిని నా కథను వర్ణించే శ్రీరామాయణాన్ని భజించి పొందండి. నా సింహాసనంలో దానిని పెట్టి కీర్తించండి. నా అన్ని ప్రభావాలను ఇందులో నిక్షేపించాను" అనేదే ఇక్కడ

తాత్పర్యం. ఈ అర్థాన్ని "స చాపి రామః పరిషద్గతః శనైః" అనే రామాయణ శ్లోకం తెలుపుతున్నది.

ఇందువల్ల, శ్రీమద్భాగవతం భగవంతుడైన శ్రీకృష్ణుని దివ్య మంగళవిగ్రహరూపం అని, శ్రీరామాయణం శ్రీరాముని దివ్యమంగళ విగ్రహరూపం అని తెలుస్తున్నది. ఆ విధంగానే భగవంద్రామానుజుల శ్రీసూక్తి అయిన శీభాష్యంకూడా భగవంతుడైన పరబ్రహ్మయొక్క దివ్యమంగళ విగ్రహం అని పెద్దలు అంటారు ఈ కారణం వల్ల దీనిని ఏమీ మార్చరు. వాస్తవానికి ఏ విధమైన దోషం అందులో లేదు.

పంచపాండవులు ద్రౌపదితో కలసి, అజ్ఞాతవాసాన్ని గడపడం కోసం విరాట నగరంలో ఒక సంవత్సర కాలం నివసించారు. అప్పుడు విరాటరాజు కుమార్తె అయిన ఉత్తర కేశాలను సంస్కరించడంకోసం ద్రౌపది సైరంధ్రీవేషాన్ని ధరించింది. ఈమెకు ఏమి చేయడం అలవాటు? అంటే, కేశాలను దువ్వడం. పరిమళద్రవ్యాలను పూయడం, జడను అల్లడం, పూలను పెట్టడంవంటివి పనులు ఈమెకు అలవాటు ఈ విధంగా చేసేవారు సైరంధ్రి అనే పేరుతో పిలువబడతారు. ఈ సైరన్ధ్రీస్థానంలో శ్రీభాష్యకారుల శ్రీసూక్తి ఉన్నది. ఇది వేదవాక్కు అనే స్త్రీకేశాలను చక్కగా సంస్కరించి, దానికి అపూర్వమైన అందాన్ని కలిగిస్తున్నది. ఈ అర్ధాన్ని వేదాంతాచార్యులవారు యతిరాజసప్తతి స్తోత్రంలోని 36వ శ్లోకంలో "చిరంతనసరస్వతీ చికురబంధ సైరంధ్రికాః" అనే అ సూక్తిలో తెలిపారు. ఇటువంటి గొప్పతనాన్ని కలిగిన శ్రీభాష్యాన్ని 30 సార్లు కాలక్షేపం అనుగ్రహించారు. 28వ సారి కాలక్షేపాన్ని చెప్పేటప్పుడు, తత్వటీక అనే వ్యాఖ్యానాన్ని శ్రీభాష్యగ్రంథానికి వారు అనుగ్రహించారు. ఈ శ్రీ భాష్య సూత్రాలలో ఉండే అర్థాలు చాలా గంభీరంగా అంతర్భవించి ఉన్నందువల్ల ఎన్నిసార్లు అధ్యయనం చేసినప్పటికీ, పండితులకు

తృప్తియే కలుగదు. ఒక్కసారి, ఆ శ్రీ సూక్తులను సేవించేటప్పుడు, కొత్త కొత్తగా ఉండే అర్థాలు ఎన్నో తోస్తాయి. ఈ గ్రంథంతో పరిచయం కలిగే కొద్ది కలిగే కొద్ది కాఠిన్యం ఎంతటిదో అర్థం అవుతుంది. దీనితో అధికషపరిచయం లేనివారికి పై పైన ఏదో ఒక అర్థం వస్తుంది. కనుక, "ఇది చాలా సులభమైనది, సులభమైన గ్రంథం" అని వారు అనుకుంటారు కానీ, అధికంగా పరిచయం కలిగినవారికి మాత్రమే ఇందులో ఉండే విశేషం ఎటువంటిదో అర్థం అవుతుంది. అందువల్ల దీని గాంభీర్యం అనుభవైకవేద్యం మాత్రమే" పరిచిత గహనాన్నః ప్రస్నువీత ప్రసాదమ్" అని అన్నారు వేదాంతాచార్యులవారు కూడా ఈ కారణం వల్లనే తమ ఆయుఃకాలం అంతా కూడా భాష్యకారుల శ్రీసూక్తులతోనే గడిపారు, వారు. " యతిప్రవరభారతీరసభరేణ నీతం వయః" అని, "నిర్విష్టం యతిసార్వభౌమవచసాం మమావృత్తిభిః యౌవనమ్" అని వారు అన్నారు.

అధికరణసారావళి అనే గ్రంధాన్ని వారు అనుగ్రహించేటప్పుడు, "సత్యైకాలంబిభాష్యమ్" అని శ్రీభాష్యంలోని గొప్పతనాన్ని చాలా గొప్పగా చెప్పారు. మిగిలిన అన్ని భాష్యాలలో కంటే ఈ భాష్యంలోని గౌరవాన్ని ఈ సూక్తి ద్వారా వారు వ్యక్తం చేశారు. పరబ్రహ్మం అనే పరతత్వాన్ని స్థాపించడం కోసమే మన రామానుజులు ఈ గ్రంథాన్ని రచించారు. మిగిలిన భాష్యాలకు ఈ గొప్పతనం లేదు. దీనిని కొంచెం ప్రస్తావించి తెలుపడం జరుగుతున్నది.

అద్వైత మతంలో అన్నిటినీ అసత్యం అని చెప్పినందువల్ల, వారి భాష్యం సత్యమైన తత్వాన్ని నిరూపిస్తున్నదని చెప్పడానికి సాధ్యం కాదు. వాస్తవానికి, అద్వైత సిద్ధాంతంలో జగత్తును అసత్యం అని చెప్పినప్పటికీ, పరబ్రహ్మ సత్యం అని వారు ఒప్పుకున్నందున సత్యమైన వస్తువును మా భాష్యం చెబుతున్నదికదా – అని వారు సంతోషపడవచ్చు. అయినప్పటికీ, ఏ విధమైన గుణం లేనటువంటి పరబ్రహ్మను

వారు ఒప్పుకున్నందువల్ల, గుణాలతో కూడి ఉండే విశిష్టబ్రహ్మను వారు అంగీకరించనందువల్ల, అటువంటి తత్వాన్ని వారి భాష్యం చెప్పలేదు. యాదవప్రకాశుల భాష్యం, భాస్కరుల భాష్యం వాస్తవమైన పరబ్రహ్మనుగూర్చి తెలుపుతూ ఉన్నప్పటికీ, వారు శక్తిని ఉపాధిని వాస్తవమైన తత్వం అని చెప్పినప్పటికీ, విషయాలు బాధితాలు అవుతున్నాయి అని అంగీకరించినందున, వారి భాష్యాలు కూడా సరికాదు.

సత్ అని అంటే చిత్ అని అర్థం. తి అంటే అచిత్ అని అర్థం. యమ్ అని అంటే, వీటిని నియమించేవాడు అని అర్థం ఇటువంటి చేతనాచేతన వస్తువులను నియమించే బ్రహ్మమే సత్యం ఈ అర్థాన్ని శ్రీ రామానుజుల భాష్యం తెలుపుతున్నది. దీనిని మనస్సులో పెట్టుకునే "సత్యైకాలంబి భాష్యమ్" అని దేశికులు అన్నారు.

ధరించే చొక్కాకు తగినట్లుగా తలను తరిగించుకోవడం అనేది ఎక్కడా లేదు. తలకు తగినట్లుగానే చొక్కాను కుట్టించుకోవాలి. ఇది లోక రీతి. శంకరాభాష్యం మొదలైన ఇతర సంప్రదాయాలకు చెందిన సూత్ర భాష్యాలు దీనికి మారుగా ఉండేవి శంకరాచార్యులవారు మొదట అధ్యాస భాష్యం అని ముందు తమ మనస్సుకు తోచినట్లుగా ఒక అర్థాన్ని నిష్కర్షించుసుకుని, "ఇదే వేదాంతాలకు, బ్రహ్మసూత్రాలకు సారమైన అర్థం" అని తీర్మానించుకొన్నారు. దీనిని దృష్టిలో పెట్టుకునే, వారు బ్రహ్మసూత్రాలకు భాష్యాన్ని రచించారు దీనికి తగినట్లుగానే వేదాంత భాగం అనే వేదశిరస్సు అయిన భేదశ్రుతిని, సగుణ శ్రుతిని ప్రమాణం కాదు అని స్థాపించాలని చూచారు. అందువల్ల వీరు తాము నిర్ణయించుకున్న సిద్ధాంతం అనే చొక్కాకు తగినట్లుగా వేదశిరస్సును తరిగారు. ఇది వారు చేసిన పెద్ద దోషం. మన రామానుజులు శ్రీభాష్యంలో ఈ విధమైన దోషం ఏమీ లేదు. బ్రహ్మసూత్రాలలో చెప్పబడిన సారమైన అర్థాలను మనసులో పెట్టుకొని, సూత్రాలలోని ఏ అక్షరం

కూడా వ్యర్థం కాకుండా వివరించారు దీనిని తెలుపడం కోసమే "సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యంతే" అని ఆరంభంలో సూక్తి ఏర్పడింది. ఇందువల్ల సూత్రాలలో ఉండే ఒక్కొక్క అక్షరంలోని అర్థాన్ని పర్యాలోచన చేసి, భాష్యం రచింపబడిన విషయం స్పష్టమవుతుంది. తమ మనసుకు తోచినట్లుగా అర్థం చేయబడలేదు లేదు – అని స్పష్టం చేయబడింది.

మంత్రంలోనూ, ఆ మంత్రంలో చెప్పబడే అర్థంలోనూ, అంటే, ఆ మంత్రం ప్రతిపాదించే దేవత విషయంలోనూ, ఆ మంత్రాన్ని ఉపదేశించిన ఆచార్యుని విషయంలోనూ భక్తి తప్పకుండా ఉండాలి. ఆ విధంగా భక్తి కలిగి ఉంటేనే, మంచి గతి కలుగుతుంది. మంత్రాల అర్థాలను చక్కగా తెలుసుకోవడానికి వీలవుతుంది. ఉపనిషత్తు అనే మంత్రం, అందులో చెప్పబడే శ్రీమన్నారాయణుడనే పరదేవత, ఉపనిషత్తులను ఉపదేశించిన భగవానుడు అని ఈ ముగ్గురి విషయంలోనూ మనం భక్తి కలిగి ఉండాలి. ఆ విధంగానే వ్యాసుని సూత్రాలలోనూ అందులో చెప్పబడే పరబ్రహ్మ విషయంలోను ఈ సూత్రాలను మనకు ఉపదేశించిన వ్యాసుని విషయంలోనూ మనకు భక్తి ఉండాలి. ఈ విధంగా ఉండేవానికే వేదాంతంలోని అర్థం, సూత్రార్థం చక్కగా బోధపడుతుంది. అది, మిగిలినవారికి లేదు, కనుక, సూత్రార్థాన్ని చక్కగా తెలియడానికి వారికి సాధ్యం కాదు. ఈ విధంగానే, మనం, శ్రీభాష్యంలో, అందులో ప్రతిపాదింపబడే శ్రీనివాసుడు అనే భగవంతుని విషయంలో, ఈ శ్రీభాష్యాన్ని ఉపదేశించే శ్రీభాష్యకారుల విషయంలో భక్తి ఉన్నవానికే, శ్రీభాష్యంలోని అర్థం చక్కగా బోధపడుతుంది. మిగిలినవారికి అది లేదు, కనుక, శ్రీభాష్యంలోనే అర్థం వారికి తెలియదు. బాగా తెలియడానికి వారికి సాధ్యం కాలేదు. అందువల్లనే "తద్భాష్యం, స చ భాష్యకృత్, స చ హరిః సమ్యక్ ప్రసీదంతు నః "అని పెద్దలు అన్నారు.

ఈ శ్రీభాష్యాన్ని మన రామానుజులు అనేక శాస్త్రాలలో పరిచయాన్ని కలిగిన కూరేశులు అనే తమ శిష్యులను సహాయంగా చేసుకొని రచించారు – అని పెద్దలు అంటారు. కూరం అనే అగ్రహారంలో అవతరించిన ఈ మహానుభావుల మహిమ వాచా మగోచరమైనది. వీరు శ్రీరామానుజుల కంటే వయస్సులో పెద్దవారు. సామర్థ్యంలోనూ, జ్ఞానంలోనూ, చాలా గొప్పవారు అని చెప్పడం జరుగుతున్నది. దర్శన రక్షణ కోసం తమ దర్శనాలను రెండిటిని త్యాగం చేసిన మహోదారులు. వీరి వైభవాన్నిగూర్చి పెద్దలు చెప్పే ఒక అద్భుతమైన శ్లోకం ఉన్నది.

**ఆర్వాంచో యత్పదసరసిజద్వంద్వ మాశ్రిత్య, పూర్వే**
**మూర్ధ్నా యస్యాన్వయ ముపగతా దేశికా ముక్తి మాపుః,**
**సో ఽ యం రామానుజముని రపి స్వీయముక్తిం కరస్థాం**
**యత్సంబంధా దమనుత కథం వర్ణ్యతే కూరనాథః. ?**

ఏ శ్రీభాష్యకారుల శ్రీచరణసంబంధాన్ని పొంది, వారికి తరువాత అవతరించిన ఆచార్యులు మోక్షాన్ని పొందారో, ఏ భాష్యకారుల సంబంధాన్ని పురస్కరించుకొని వారికి ముందున్న ఆచార్యులు మోక్షాన్ని పొందారో, అటువంటి రామానుజులు ఈ కూరేశుల సంబంధంతో తాము, తమకు ఏర్పడే ముక్తి చేతిలో ఉన్నది అని భావించారట. అందువల్ల వీరి గొప్పతనం మాటకు, మనసుకు అందనిది అనే విషయంలో ఏమి సందేహం?

"మొழிయై క్కడక్కుమ్ పెరుమ్ పుగழாన్, వంజ ముక్కుఱుంబామ్ కుழிయై క్కడక్కుమ్ నమ్ కూరత్తాழ்వాన్" (మాటకు అందని గొప్ప కీర్తిని కలవారు, వంచించే ధనమదం, విద్యామదం, అభిజనమదం అనే మూడు విధాలైన మదాలకు అతీతులైన మన కూరేషులు) అని తిరువరంత్తముదనారు కూడా

కూరేశులను కీర్తించి పలికారు. ఈ విధంగా అంతు లేని గొప్పతనాన్ని మీరు పొందారు అని అంటే శ్రీరామానుజులకు గొప్పతనం తగ్గిపోతుందేమో? అని భావించనక్కరలేదు. శిష్యుల గొప్పతనం పెరిగే కొద్దీ, ఆచార్యులకే గొప్పతనం అవుతుంది మహాలక్ష్మిని భగవంతుని కంటే గొప్పతనం కలిగిన దానినిగా కీర్తించి పలికితే, అది భగవంతుని కీర్తించినట్లేకదా అవుతుంది. "శిష్యాదిచ్చేత్ పరాజయమ్" అని కదా, శాస్త్రం చెబుతున్నది ఇది ఆచార్యుని కీర్తిలోకూడా అన్వయిస్తుంది. దీనికి ఒక ఉదాహరణను గమనిద్దాం.

ఒక అరైయర్ స్వామి భగవంతుని విషయంలో అధికమైన భక్తిని కలిగి ఉండేవారు. అళ్వార్ల పాశురాల ప్రకారం భగవంతుని ముందు అభినయాన్ని చేసి చూపించేవారు. మీరు చేసే అభినయాన్ని చూచి, భగవంతుడు వీరి పట్ల చాలా ప్రేమను కలిగి వీరితో మాట్లాడడం ఆరంభించాడు. ఈ విధంగా కొంత కాలం జరిగిన తరువాత తన విషయంలో భగవంతుడు నేరుగా మాట్లాడడాన్ని చూసి, ఈ స్వామి గర్వాన్ని పొందారు. తమకంటే గొప్పవారు ఎవరు లేరు అని మనసులో భావించినందున, వారి మనస్సు కలతపడింది. ఈ విధంగా ఉండగా మీరు భగవంతుని విషయంలో గొప్పవారైన భాగవతుల విషయంలో క్రమంగా అపచారపడడం ఆరంభించారు. కొంతకాలం గడిచే సమయానికి, భగవంతుడు వీరిని సంస్కరించాలని భావించాడు ఒకానొక సమయంలో భగవంతుడు స్వామిని చూచి, "మీరు చేసే ఈ భాగవతదోషం అళ్వార్ల విషయంలోకూడా పర్యవసిస్తుందా?" అని అడిగాడు. "ఆహా! సందేహం ఏమి? ఆ విధంగా పర్యవసించకుండా ఎందుకు ఉంటుంది? ఆళ్వారులు కూడా తమ స్తుతిలో ప్రయత్నించారుకదా!" అని అన్నారు. "ఎక్కడ వారు ఆ విధంగా ఎక్కడ పలికారు?"

అని భగవంతుడు అడుగగా, "తిరుమంగై ఆళ్వారులు ఒక్కరే చాలు, దీనికి ఉదాహరణంగా" – అని ఆ స్వామి అన్నారు. పెరియ తిరుమొழி ప్రబంధంలో

**శెంగమలత్తు అయన్ అనైయ మఱైయోర్ ★ కాழி**
**చ్చీరామ విణ్ణగర్ ఎన్ శెంగణ్ మాలై ★**
**అంగమల త్తడవయల్ శూழ் ఆలి నాడన్ ★**
**అరుళ్మారి అరట్టముక్కి అడైయార్ శీయమ్ ★★**
**కొంగు మలర్ క్కుழలియర్ వేళ్ మంగై వేందన్ ★**
**కొఱ్ఱవేల్ పరకాలన్ కలియన్ శొన్న ★**
**శంగ ముగ త్తమిழ் మాలై పత్తుం వల్లార్ ★**
**తడంగడల్ శూழ் ఉలగుక్కు త్తలైవర్ తామే.** (3–4–10)

(తామర పువ్వులో నివసించే బ్రహ్మావంటివారు నివసించే కాళిచ్చీరామ విణ్ణరమ్ అనే దివ్యదేశంలో వాసం చేసే తామర పువ్వులవంటి నేత్రాలను కలిగిన భగవానునిగూర్చి అనుగ్రహింపబడినది, ఈ దశకం. దీనిని పాడినవారు, అందమైన తామరలు విస్తరించి ఉండే చెరువులను, కాలువలను చుట్టూ కలిగిన తిరువాలి దివ్యదేశానికి అధిపతి, అనుకూలురకు మేఘంవలే అనుగ్రహాన్ని చూపించేవారు, గర్వాన్ని కలిగినవారిని తమకు వశం చేసుకోగలిగినవారు, శత్రువులకు సింహంవంటివారు, తేనె నిండుగా ఉండే పువ్వులను కల కేశాలను కలిగిన స్త్రీలకు మన్మథునివంటివారు. తిరుమంగై నగరానికి అధిపతి. తనను ఎదిరించేవారికి యమునివంటివారు. జయాన్ని తప్పకుండా కలిగించే వేలాయుధాన్ని ధరించేవారు. వీరు అనుగ్రహించిన ఈ దశకం గుంపులు గుంపులుగా కూడి ఉండి అనుభవించదగినది. ఈ ద్రావిడసందర్భాన్ని అర్థంతో అభ్యసించినవారు, విశాలమైన సముద్రాన్ని చుట్టూ కలిగిన ఈ లోకంలో అందరూ కీర్తించేటటువంటి గొప్పతనాన్ని పొంది, సుఖంగా జీవిస్తారు.)

అని ఆ ఆళ్వార్లు అనుగ్రహించిన పాశురాన్ని నీవు తలను ఊగిస్తూ విన్నావు కదా. ఈ పాశురంలో ఉండే నాలుగు పాదాలలో, ఒక పాదంలోమాత్రమే ఆ ఆళ్వారులు నీ గుణాన్ని కీర్తించారు. మిగిలిన మూడు పాదాలలోనూ తమ మహిమను కీర్తించారు. తమ బిరుదులను, తమకు ఏర్పడిన అసాధారణమైన గొప్పతనాన్ని తెలిపి, తమను గొప్పగా చెప్పుకున్నారే తప్ప, నిన్ను అధికంగా చెప్పలేదు ఇది ఏమి భగవద్గుణానుభవం? " అని ఆ అరైయర్ స్వామి అన్నారు.

అప్పుడు భగవంతుడు మందహాసంతో "నా భక్తుని మహిమనుగూర్చి పలకడం నన్ను స్తోత్రం చేయడంలోకే పర్యవసిస్తుంది సుమా. అది వారికి దోషం కాదు. అంతటా నన్ను కీర్తించి పలకడం, నా గుణాలనే పలకడం, నేను నివసించే దివ్యదేశాలనే పలకడం, అక్కడ ఉండే భాగవతులను గూర్చి పలకడం, అక్కడ జరిగే నానావిధాలైన పూజలను, యజ్ఞయాగాలను గూర్చి పలకడం– అనే ఇది అంతా నన్ను స్తుతించడంలోకే చివరికి వస్తుంది. ఇది వారికి దోషం కాదు "అని అన్నాడు.

భగవంతుని వచనాలను విన్న ఆ అరైయర్ స్వామి, తమ తప్పును తెలుసుకొని సిగ్గుతో తలవంచుకొని భాగవతులను కీర్తించి ఆరాధించడం ప్రారంభించార. అందువల్ల భాగవత పూజ అనేది భగవంతుని పూజలోకి చేరుతుంది అనేది స్పష్టమవుతుంది ఆ విధంగానే, ఆళ్వారుల మహిమను చెప్పడం కూడా శ్రీ భాష్యకారుల మహిమలోకి చేరుతుంది – అని చెప్పాలి.

ఇంతేకాక, శ్రీభాష్యకారుల మహిమను కొంచెం ఇక్కడ అనుభవిద్దాం. ఒకడు దాహంతో బాధపడుతూ ఉన్నాడు. అతని నాలుక ఎండిపోతున్నది. ఎక్కడైనా చల్లటి నీరు దొరుకుతుందా? " అని అతడు చూశాడు. అతనికి దూరంగా ఒక చెరువు కనిపించింది. అతడు తన దాహాన్ని తీర్చుకోవడం కోసం వేగంగా అక్కడికి వచ్చాడు. అందులో మొదట బురద అధికంగా ఉన్నందువల్ల, అందులో

చిక్కుకున్నాడు. చాలా కష్టపడి అందులో బయటకు వచ్చాడం. తరువాత ఇంకొంచెం లోపలకు దిగి, చేపలను పట్టుకోవడం కోసం అందులో విసరిన వలలో చిక్కుకొన్నాడు. ఆ వలనుండికూడా చాలా కష్టంతో బయటపడ్డాడు. అక్కడనుండి కొంచెం ముందుకు వెళ్లాడు. అక్కడ ఒక యంత్రం ఉన్నది అందులో అతడు చిక్కుబడిపోయి బయటకు రాలేకపోయాడు. ఏ ప్రయత్నం చేసినా, బయటకు రావడానికి అతనికి సాధ్యం కాలేదు. దానిలోనుండి అక్కడకు దగ్గరలో ఉండే పల్లపు ప్రదేశంలోకి దూకి బయటపడ్డాడు. ఎవరైనా నన్ను భయంకరమైన ఈ ఆపద నుండి బయటపడవేస్తారా? అని బాధపడుతున్నాడు. అదే సమయంలో, ఇతని ప్రయత్నాన్ని చూసిన ఒకడు పరిగెత్తుకొని వచ్చి తన చేయూతను ఇచ్చి, అతనిని పల్లపు ప్రదేశంలో నుండి బయటకు లాగి, ఇతనిని తీరానికి చేర్చి రక్షించాడు.

ఆ విధంగానే ఒక దుర్గశను భగవంతుడు పొందాడు. అది ఏ విధంగా? అంటే, ఇతర మతాలవారి చేతిలో, అంటే వారు చేసే వాదాలలో భగవంతుడు చిక్కుకొన్నాడు. మొదట, శైవమతం అనే బురదలో చిక్కుకున్నాడు. కపిలుని కల్పనలు అనే వలలో చిక్కుకున్నాడు. ద్రుహిణమతం అనే యంత్రంలో చిక్కుకున్నాడు. అక్కడనుండి బయటపడలేక తపించాడు. దానిలోనుండి దగ్గరలో ఉండే పల్లపు ప్రదేశంలోకి ఏదో విధంగా దూకి బయటపడ్డాడు. కానీ అది ఎంత పల్లం అంటే, మాయావాదులు అనే అద్వైతుల వంచనలు అనే చాలా లోతైన పల్లం. అందులోనుండి బయటకు రావడానికి వీలు కాక చాలా బాధపడుతూ, "అయ్యో! సర్వశక్తి అయిన నాకు ఈగతి పట్టిందా? నన్ను బయటపడవేసి రక్షించేవారు ఎవరూ లేరా? "అని బాధపడుతూ ఉన్నాడు. అప్పుడు మన శ్రీరామానుజులు తమ చేతిలో ఉండే అతనికి సహాయంగా త్రిదండాన్ని ఇచ్చి, పల్లంలోనుండి భగవంతుని బయటకు వచ్చేటట్లు చేశారు. వలలను ఛేదించారు. ఈ విధంగా తనకు కలిగిన దుర్గతిని భగవంతుడు భగవద్రామానుజులవలన పోగొట్టుకోగలిగాడు. ఈ విధంగా

రామానుజులు అవతరించి ఉండకపోతే, భగవంతుని గతి ఏమయు ఉండేది? అని వేదాంతాచార్యులు యతిరాజసప్తతిలో అంటారు.

**కపర్ధమతకర్దమం కపిలకల్పనావాగురాం**
**దురత్యయ మతీత్య తత్ ద్రుహిణతంత్రయంత్రోదరాత్,**
**కుదృష్టికుహనాముఖే నిపతతః పరబ్రహ్మణః**
**కరగ్రహ విచక్షణో జయతి లక్ష్మణో ऽ యం మునిః. (38)**

అని అన్నారు. శ్రీ రామానుజులు శైవమతం అనే బురదను కపిలుని వలను, ద్రుహిణుని యంత్రాన్ని, కుదృష్టుని వంచనను ఉపనిషత్తులలోను, వాని వివరణమైన బ్రహ్మసూత్రాలలోనూ చెప్పబడ్డ న్యాయాలతోనే తొలగించారు. యతిరాజులు వీటిని ప్రస్తావించి చూపించడం కోసమే సూత్రవ్యాఖ్యానం అయిన శ్రీభాష్యాన్ని అనుగ్రహించారు. వీరు ఈ భాష్యాన్ని అనుగ్రహించి ఉండకపోతే, పరబ్రహ్మ యొక్క గతి ఏమయి ఉండేదో కదా! , అంత మాత్రమేనా మనంకూడా, పరమాత్మ వలె బురదలో, వలలో, వంచనలో, మాయావాదాలలో చిక్కుకొని తపిస్తూ ఉండవలసి ఉండేది. “భగవంతుడు మనం అందరికంటే ఉత్తముడు, శేషి మనం ఆ స్వామికి శేషబభూతులం” అనే ఇదే ప్రణవంలో ఉండే ముఖ్యమైన అర్థం. వేదంలోనూ చెప్పబడే సారమైన అర్థంకూడా ఇదే. ఈ అర్థాన్నే సూత్రకారులు స్పష్టంగా అనుగ్రహించారు. దీనినే శ్రీ భాష్యకారులు పలు విధాలుగా పలు అధికరణాలలో ప్రస్తావించి పలికారు. ఈ అర్థాన్ని తెలిసినవాడు బురదలో పడి తపించడు. వలలో చిక్కుకోడు. యంత్రాల్లో పడడు. ఇతరుల మాయావాదాలకు వశం కాడు. ఇదే శ్రీభాష్యానికి సారమైన అర్థం. స్వస్తి.

**“ప్రపద్యే ప్రణవాకారం భాష్యం రంగమివాపరమ్,**
**పరస్య బ్రహ్మణో యత్ర శేషిత్వం స్ఫుట మీక్ష్యతే.”**

★★★★

# 7. సంధ్యావందనమహిమ

సంధ్యావందనంలో ఏమి ఉన్నది? ఏ మహిమ ఉన్నది?

ముందుగా గమనిస్తే, ఇందులో భగవంతుని నామసంకీర్తనం ఉన్నది. ప్రారంభంలోనే ఆచమనం చేసేటప్పుడు, అచ్యుతానంత గోవింద నామాలను, కేశవాది ద్వాదశనామాలను సంకీర్తనం చేయడం జరుగుతుంది. ఈ విధంగా ఆచమనం చేయడం సంధ్యావందన ప్రక్రియలో ఒకసారి కాదు, పలుమార్లు చేయడం జరుగుతుంది. కనుక, పలుమార్లు భగవాన్నామాల సంకీర్తనం చేయబడుతుంది. ఈ విధంగా నామసంకీర్తనం ఈ నిత్యకర్మలో ఇమిడి ఉన్నదని తెలిస్తే, మనం ఎంతో ఆశగా, ప్రీతిగా ఈ కార్యాన్ని చేయవచ్చుకదా.

ఇక, రెండవది, భగవంతునకు ద్రవ్యసమర్పణను చేయడం. భగవంతుని ఆరాధనలో పూలను సమర్పించడం, చందనం సమర్పించడం, ధూపాన్ని సమర్పించడం, దీపాన్ని సమర్పించడం, ఫలాన్ని, ప్రసాదాన్ని సమర్పించడంవంటి ఎన్నో పవిత్ర ద్రవ్యాలను స్వామికి సమర్పించే కార్యాన్ని చేస్తాము. ఈ విధంగా ఏ వస్తువునూ మనం సమర్పించలేకపోయినా, కనీసం జలాన్ని అయినా సమర్పించగలం కదా. "పత్రం పుష్పం ఫలం తోయమ్" అని గీతలో భగవానుడే స్వయంగా అన్నాడు కదా. ఇటువంటి పవిత్రమైన జలాన్ని భగవంతుని ఉద్దేశించి, ఆ స్వామి నామాలను భక్తితో ఉచ్చరిస్తూ, " కేశవం తర్పయామి నారాయణ తర్పయామి మాధవం తర్పయామి "అని జలాన్ని సమర్పించే పూజకూడా ఈ సంధ్యావందనంలో అంతర్గతమై ఉన్నది అందువల్ల సంధ్యావందనమే ఒక పూజ.

ఈ విధంగానే, ధ్యానంకూడా ఈ సంధ్యావందనంలో చోటు చేసుకున్నది. గాయత్రీ మంత్రజపం పూర్తి అయిన తరువాత, గాయత్రీ మంత్రంచే

ప్రతిపాదింపబడే, సూర్యమండలంలో నెలకొని ఉండే పరమాత్మ స్వరూపాన్ని ధ్యానం చేస్తూ, " ధ్యేయః సదా సవితృమండల మధ్యవర్తీ, నారాయణః సరసిజాసన సన్నివిష్టః" అని ఈ విధంగా భగవంతుని ధ్యానం చేసే క్రమం కూడా ఉన్నది.

ఇదేవిధంగా, ప్రాణాయామం చేసే క్రమంకూడా ఇందులో ఉన్నది. సంధ్యావందన ప్రారంభంలో ఆచమనం చేసిన తరువాత, ఆ విధంగానే, ద్వాదశనామాలతో జలతర్పణాన్ని చేయడానికి ముందు, గాయత్రీమంత్ర జపానికి ముందు, తరువాత కూడా ఈ ప్రాణాయామాన్ని చేయడం జరుగుతుంది.

ఆసనం అనే యోగప్రక్రియలోనిఅంగం కూడా ఇందులో ఉన్నది. సరి అయిన చోట పద్మాసనంలో కూర్చుని, గాయత్రీ మంత్రజపాన్ని సాయంసమయంలో చేయడం క్రమం.

ఈ విధంగా సంధ్యావందనంలో కర్మ ఉన్నది, యోగం ఉన్నది, పూజ ఉన్నది, వస్తుసమర్పణం ఉన్నది. ధ్యానం ఉన్నది, జపం ఉన్నది.

ఇంకా సంధ్యావందనంలో ఏమి ఉన్నది? అని అంటే, జ్ఞానంకూడా ఉన్నది. "అసా వాదిత్యో బ్రహ్మ" అని మొదలైన బ్రహ్మతత్వాన్ని తెలియజేసే శ్రుతివాక్యాల అనుసంధానం కూడా ఇందులో చేయబడుతుంది.

ఇక, అన్ని ఉపాయాలలోనూ ఉత్తమ ఉపాయంగా వేదం కీర్తించే శరణాగతి కూడా ఈ సంధ్యావందనంలో ఉన్నది. సంధ్యావందనం అంతా పూర్తి అయిన తరువాత, చివరిలో, "శంఖచక్రగదాపాణే! ద్వారకా నిలయాచ్యుత! , గోవింద పుండరీకాక్ష రక్ష మాం శరణాగతమ్" అని భగవంతుని శరణాగతి చేసే శ్లోకానుసంధానంకూడా ఇందులో చేయబడుతుంది.

జ్ఞానయోగం, శరణాగతి ఉన్నట్లే, కర్మయోగం కూడా ఇందులో ఉన్నది. సంధ్యావందనం పూర్తి అయిన తరువాత, " కాయేన వాచా మనసేంద్రియైర్వా

బుధ్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్, కరోమి యద్యత్ సకలం ఫలం తత్ నారాయణాయేతి సమర్పయామి" అని (నేను శరీరంతో, వాక్కుతో, మనస్సుతో, బుద్ధితో కాక, సహజమైన స్వభావంతో నేను ఏ ఏ కార్యాలను చేస్తున్నానో ఆ కార్యాల ప్రయోజనాలు అన్ని నారాయణునకే సమర్పిస్తున్నాను) అని ఫలత్యాగంతో కూడిన కర్మయోగం కూడా ఇందులో ఉన్నది.

భగవంతుని నామానుసంధానంతో ఈ సంధ్యావందన కర్మ ప్రారంభమైనట్లే, ఆ భగవంతుని నామానుసంధానంతోనే పూర్తి అవుతున్నది. " ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపఃకర్మాత్మకాని వై, యాని కర్మాణ్యశేషాణాం శ్రీకృష్ణానుస్మరణం పరమ్" అని శేషత్వానుసంధాన పూర్వకమైన భగవన్నామానుసంధానంతో ఈ కర్మ పూర్తి అవుతున్నది.

ఈ విధంగా సంధ్యావందన క్రమాన్ని గమనించి చూస్తే, ఇదే కర్మయోగం, ఇది జ్ఞాన యోగం, ఇదే ప్రపత్తియోగం, ఇదే నామ సంకీర్తనం అనేటట్లుగా ఉంటుంది ఇటువంటి సంధ్యావందన నిత్య కర్మను విడవకుండా భగవంతునిపై ప్రీతితో ఆ స్వామిని ఆనందింప చేసే కర్మగా భావించి చేయాలి.

"ఆహరహః సంధ్యా ముపాసీత" అని వేదం ప్రతిదినం సంధ్యావందనాన్ని చేయమని చెప్పింది. " సంధ్యాహీనో ఽ శుచిః అనర్హ సర్వకర్మసు" అని సంధ్యావందనం చేయని వారికి ఏ కర్మను చేసే యోగ్యత లేదని చెప్పిందికూడా. శాస్త్రం. అందువల్ల ఈ సంధ్యావందనకర్మ స్వరూప యోగ్యతను కలిగిస్తుంది. ఎవడు ఏ వైదిక కర్మను చేయాలన్నా, ప్రతిదినం సంధ్యావందనాన్ని చేసేవాడై అతడు ఉంటేనే, అతడు ఆ పనిని చేయడానికి తగిన యోగ్యత ఏర్పడుతుంది.

ఇందువల్ల యథాశక్తి సంధ్యావందన కర్మను ఆచరిస్తూ ఉన్నప్పుడే, యోగ్యత సిద్ధిస్తుంది. క్షేమం కలుగుతుంది.

తాను ఉండే ఊరుకు, దేశానికి, లోకానికి కూడా క్షేమంగా కలుగుతుంది.

ఈ సంధ్యావందన కర్మ అనేది కేవలం వ్యక్తిగతమైన క్షేమం కోసం, లాభం కోసం కాదు. లోకక్షేమంకోసం కూడా చేయాలి. ఈ విషయం సంధ్యావందనంలో జపించే మంత్రాలలోని అర్థాలను గమనిస్తే తెలుస్తుంది.

ఇందువల్ల ఈ సంధ్యావందన కర్మను విడవకుండా తప్పకుండా చేయాలి.

★★★★★

# 8. గాయత్రి – శ్రీరామాయణమ్ – 1

**"గాయత్ర్యాః స్వరూపం తత్ రామాయణ మనుత్తమమ్"**

**ఆవిర్భావప్రసక్త్యా సవితు, రథ మతిప్రేరణాత్, వేదరూపాత్**
**విశ్వామిత్రేణ సక్త్యా చ వరవితరణేనామృతస్యందిరూపాత్,**
**ఛందోరూపేణ చాంభోరుహనిలయముఖప్రాప్తరూపేణ చాపి**
**శ్రీగాయత్ర్యాఖ్యమంత్రం బహువిధసమతాం యాతి రామాయణేన.**

ఆదికావ్యం అయిన శ్రీరామాయణం లోకంలో మిక్కిలి ప్రచారం కావడానికి గల కారణాలలో ఒకటి – అది గాయత్రీ మంత్రస్వరూపమై ఉండడం, గాయత్రీ మంత్రంతో దానికి పలు విధాలుగా సామ్యాలు ఉండడం. ఈ విధంగా గాయత్రీ మంత్రానికి, వాల్మీకి రామాయణానికి మధ్య ఏ ఏ అంశాలలో సామ్యాలు ఉన్నాయి? అనే విషయం కొన్ని ముఖ్యమైన అంశాలను దృష్టిలో పెట్టుకొని ఇక్కడ వివరించడం జరుగుతున్నది.

## 1) ఈ రెండు సవితయొక్క ఆవిర్భావాన్ని గూర్చినవి

సవిత అంటే సూర్యుడు. సూర్యవంశం ప్రకాశరూపుడై వెలిగినవాడు, శ్రీరాముడు. ఆ స్వామి కథే రామాయణం. ఈ విధంగా సవిత యొక్క సంతతికి సంబంధించినది రామాయణం. గాయత్రీ మంత్రంకూడా ఇటువంటిదే. ఏవిధంగా అయినది? అని అంటే, ఈ మంత్రంలోని "సవితుః, భర్గః "అనే పదాలు ఉన్నాయి. సూర్యుని తేజస్సు అని కానీ, సృష్టికర్త అయిన భగవంతుని తేజస్సు అని కాని దీనికి అర్థం చెప్పడం పొసగుతుంది. ఏ విధంగా అయినా, గాయత్రికి, సవితకు సాధారణంగా అనుబంధం. ఉన్నది.

### 2) ఈ రెండు బుద్ధిని ప్రేరేపించగలిగినవి

వాల్మీకి రామాయణం యుద్ధకాండ చివరిలో ఫలశ్రుతి చెప్పబడింది. “సౌభ్రాత్రకం బుద్ధికరం శుభం చ” అనే ఒక ప్రయోగం అక్కడ ఉన్నది. శ్రీరామాయణం పారాయణం చేసేవారికి కలిగే అనేక విధాలయిన ప్రయోజనాలలో చక్కని బుద్ధి కలగడం అనేది ఒకటి అని ఈ సూక్తి తెలుపుతున్నది. గాయత్రీ మంత్రంలో కూడా ఇది ఇంకా ముఖ్యంగా ఉన్నది. ఏ విధంగా అంటే, ఆ మంత్రం చివరిలో ఉండే పాదం “ ధియో యో నః ప్రచోదయాత్ “అని ఉన్నది. అంటే, మన జ్ఞానాన్ని, బుద్ధిని ప్రేరేపిస్తుంది – అనే అర్థాన్ని ఈ సూక్తి ఇస్తుంది.

### 3) ఈ రెండు వేదస్వరూపాలే

శ్రీరామాయణం “ వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా” (వేదం వాల్మీకి ద్వారా శ్రీరామాయణంగా ఆవిర్భవించింది) అనే ప్రసిద్ధమైన సూక్తి వేదస్వరూపమని తెలుపుతున్నది ఆ విధంగానే, గాయత్రీ మంత్రం కూడా వేదంలో ఉన్నందువల్ల, వేదానికే మాత అని కీర్తింపబడడం వల్ల మహిమను కలిగినది.

**“ఋగ్వేదః పూర్వచరణో యజుర్వేదో ద్వితీయకః, సామవేదః తృతీయస్తు”**

(గాయత్రీ మంత్రంలో ఋగ్వేదం పూర్వ చరణం, యజుర్వేదం రెండవ చరణం, సామవేదం మూడవ చరణం) అని భారద్వాజ స్మృతి తెలుపుతున్నది. ఈ విధంగా వేద స్వరూపమైనది, గాయత్రీ మంత్రం.

### 4) ఈ రెండిటి అవతారాలలోనూ విశ్వామిత్రుడు ఉన్నాడు

శ్రీరామాయణంలో రామావతార సర్గలో విశ్వామిత్రుడు ప్రవేశిస్తాడు. గాయత్రీమంత్రం భూమిలో అవతరించడానికి విశ్వామిత్రుడు కారణమయ్యాడు. అతడే ఆ మంత్రాన్ని మొట్టమొదటగా సాక్షాత్కరించుకో గలిగాడు. అందువల్లనే మనం ప్రతి దినం “సావిత్ర్యాః ఋషిః విశ్వామిత్రః” అని అనుసంధిస్తున్నాం.

5) ఈ రెండు మనకు వరాన్ని ఇస్తాయి

శ్రీరామాయణం ఫలశ్రుతిలో " తే ప్రార్థితాన్ వరాన్ సర్వాన్ ప్రాప్నువంతీహ రాఘవాత్" (వారు కోరిన వరాలను అన్నిటిని, రాఘవా! , నీవల్ల పొందుతారు) అని చెప్పబడింది. ఈ సూక్తి లోని అర్థం గాయత్రీ మంత్రంలోకూడా అన్వయిస్తుంది. ఈ మంత్రం ఆవాహనలోనే "ఆయాతు వరదా దేవీ" అని ఉన్నందువల్ల, వరాన్ని ఇచ్చే స్వభావం ఈ మంత్రానికి ఉన్నదని తెలుస్తున్నది.

6) రెండు అమృతాన్ని చిందించేవి

వాల్మీకి రామాయణం ఉపక్రమ శ్లోకంలో "యః పిబన్ సతతం రామచరితామృత సాగరమ్" (ఎవడు రామ చరిత్ర అనే అమృత సముద్రాన్ని ఎల్లప్పుడూ స్నానం చేస్తున్నాడో) అనే శ్లోకంలో రామ చరిత్ర అమృతమయమైనదని చెప్పబడింది. గాయత్రీ మంత్రం కూడా అమృతం చిందించేది అని ఒక కథ వేదంలో ఉన్నది. " గాయత్రీ ఉదపతత్, సా సోమం చాహరత్" అని అందులో చెప్పబడింది.

7) ఈ రెండు బ్రహ్మోపదేశం ద్వారా సిద్ధించినవి

రామాయణాన్ని బ్రహ్మ వాల్మీకికి ఉపదేశించాడు. " తచ్చాప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి" (నీకు తెలియనిది అంతా కూడా నీకు తెలియగలదు) అని బ్రహ్మ అనుగ్రహించినందువల్ల, నిజమైన రామాయణ వృత్తాంతాలను తెలిసివాల్మీకి రచించాడు. గాయత్రీ మంత్రం కూడా బ్రహ్మోపదేశం అనే క్రమ ద్వారానే పొందబడుతున్నది. ఉపనయన కార్యక్రమంలో శుభముహూర్తంలో బ్రహ్మోపదేశం అనే పేరులోనే గాయత్రీ మంత్రం ఉపదేశింపబడుతున్నది. ఇది బ్రహ్మోపదేశం అనబడుతున్నది. బ్రహ్మ అంటే, గాయత్రీ మంత్రమే. ఇక్కడ బ్రహ్మోపదేశం అనే పదానికి శ్రీరామాయణంలో ఒక విధంగాను, గాయత్రీ మంత్రంలో ఒక విధంగాను

విడదీసి అర్థాన్ని గ్రహించాలి. శ్రీరామాయణం విషయంలో బ్రహ్మ చేసిన ఉపదేశమని, గాయత్రీ మంత్ర విషయంలో బ్రహ్మ యొక్క ఉపదేశమని అర్థాన్ని గ్రహించాలి.

### 8) ఈ రెండు ఛందో రూపమైనవి

ఛందస్సు అంటే, శ్లోకాలలో 8 విధాలయిన రీతులు ఉన్నాయి. గాయత్రీ అనేది ఒక మంత్ర నామం అయినట్లుగానే, ఒక ఛందస్సుకు కూడా పేరు అవుతున్నది. వాల్మీకి రామాయణం 'కురు రామకథాం పుణ్యాం శోకబద్ధాం మనోరమామ్" అని బ్రహ్మ ఆదేశించిన విధంగానే శోకరూపంలో అవతరించింది.

ఈ విధంగా, శ్రీరామాయణానికి, గాయత్రీ మంత్రానికి మధ్య అనేక విధాలైన సామ్యాలు ఉన్నాయి.

★★★★★

# 9. గాయత్రి – శ్రీరామాయణమ్ – 2

**2) పాదైః బద్ధం, ప్రణీతం మునికులవిధునా, సమ్మితం బ్రహ్మణశ్చ, స్యాదధ్యేయం త్రిసంధ్యం, సమమపి చ తథైవాక్షరైః, ధ్యానముఖ్యమ్, భానాద్వేదస్య పాపౌఘహరమపి, చతుర్వింశతివ్యాప్తరూపం శ్రీగాయత్ర్యాఖ్యమంత్రోపమ మిహ ఖలు భాభాతి సీతాచరిత్రమ్.**

## 1) రెండు పాదబద్ధాలు

"పాదబద్ధోఽ క్షరసమః తంత్రీలయ సమన్వితః" అని శ్రీరామాయణంలో రామాయణాన్ని గూర్చి చెప్పబడింది. ఇక్కడ, పాదం అంటే, శ్లోకంలోని నాలుగవ భాగం. ఒక్కొక్క శ్లోకంలోనూ నాలుగు పాదాలు ఉంటాయి. బద్ధః అంటే, కూర్చబడినది అని అర్థం. గాయత్రీ మంత్రం కూడా ఇదే అర్థంలో పాదబద్ధం. ఇందులో నాలుగు పాదాలకు బదులు మూడు పాదాలు ఉన్నాయి. ఇదే ఇక్కడ తేడా. "త్రిపదా గాయత్రీ" కదా.

## 2) రెండు ముని ప్రణీతాలు

శ్రీరామాయణంలో " రఘువర చరితం మునిప్రణీతమ్" అనే ఒక సూక్తి ఉన్నది. ఇక్కడ ముని ఎవరంటే, వాల్మీకి మహర్షియే. ప్రణీతం అంటే, రచింపబడినది అని అర్థం. గాయత్రీ మంత్రం కూడా ముని ప్రణీతమే. అయితే ఇక్కడ ముని ఎవరంటే, ప్రణీతం అనే అర్థం ఏమంటే, సమాధానాలు వేరుగా ఉంటాయి. ఇక్కడ ముని విశ్వామిత్రుడు. ప్రణీతం అంటే ఈ లోకానికి తీసుకుని రాబడింది అని అర్థం. ఇంతకు ముందే ఉన్న గాయత్రీ మంత్రాలు దర్శించి, దానిని ఈ లోకంలో వ్యాపింప చేసినవాడు, విశ్వామిత్ర మహర్షి. కనుక ముని ప్రణీతం గాయత్రీ మంత్రం అయినది. అందువల్ల, శ్రీరామాయణం, గాయత్రీ మంత్రం అనే రెండు కూడా ముని ప్రణీతాలే.

### 3) రెండు బ్రహ్మ సమ్మితాలు

గాయత్రీ ఆవాహన మంత్రంలో "బ్రహ్మ సమ్మితమ్" అని ఉన్నది. ఈ పదం, గాయత్రీ మంత్రం పరమాత్మతో కూడినది అనే అర్థంలో చెప్పబడింది. ఇదే పదాన్ని వాల్మీకి రామాయణానికి చెప్పేటప్పుడు, వేదంతో సమానమైనది అని అర్థం చెబితే చక్కగా సరిపోతుంది.

### 4) ఈ రెండు దినం మూడు సంధ్యలలోను పఠించదగినవి

గాయత్రీ మంత్రాన్ని ప్రతిదినం మూడు సంధ్యలలో జపించవలసినది అని విధి. ఉదయ సంధ్య, మాధ్యాహ్నిక సంధ్య, సాయం సంధ్య అనే మూడు సంధ్యాకాలాలలో గాయత్రిని జపించాలి. " ప్రాతః మాధ్యందినే సాయమ్" శ్రీ గాయత్రీ కాలవ్యవస్థ చెప్పబడింది గాయత్రీ రామాయణం చివరిలో కూడా "ఇదం రామాయణం కృత్స్నం త్రిసంధ్యం యః పఠేన్నిత్యమ్" అని ఉన్నందువల్ల ఇది మూడు పొద్దులలోనూ పఠించదగినది అని తెలుస్తున్నది

### 5) రెండు అక్షరసమాలే

శ్రీరామాయణంలోని శ్లోకాలలో నాలుగు పాదాలో అక్షరాలను లెక్కబెడితే, అవి సమంగా ఉంటాయి. ఉదాహరణంగా శ్రీరామాయణంలోని మొదటి శ్లోకంలో నాలుగు పాదాలలోనూ 8, 8 అక్షరాలు ఉన్నాయి. ఈ విధంగానే, గాయత్రీ రామాయణంలో 16వ శ్లోకంలో చూస్తే, ఒక్కొక్క పాదంలోను 12 అక్షరాలు ఉన్నాయి. అది కూడా అక్షర సమమే. ఈ విధంగానే, గాయత్రీ మంత్రం కూడా ఒక్కొక్క పాదంలోనూ 8 అక్షరాలు కలిగి ఉన్నది. కానీ, ఆవాహన మంత్రంలో "అక్షరం బ్రహ్మసమ్మితమ్ " అని చెప్పిన రీతిలో అక్షరం అనబడే పరమాత్మను పోలి

ఉన్నది అని వేరొక అర్థాన్ని చెప్పుకున్నా, ఇక్కడ సరి పోతుంది. శ్రీభాష్యంలో కూడా "బ్రహ్మణ్యేవ గాయత్రీ శబ్దాభిధేయే "అని శబ్ద సామ్యం కూడా చెప్పబడింది.

### 6) ఈ రెండు ధ్యానముఖ్యాలు

శ్రీరామాయణాన్ని పారాయణం చేసేటప్పుడు అంతా, ధ్యాన శ్లోకాలను చెప్పి రాముని ధ్యానం చేయాలి. ఇదే కాకుండా, వాల్మీకి కూడా "చకార ధ్యాన మాశ్రితః, ఆజగామ తతో బ్రహ్మ "అని, " తద్గతేనైవ మనసా వాల్మీకి ధ్యానమాస్థితః" అని చెప్పినట్లుగా ధ్యానం చేసిన తరువాతనే ఆదికావ్యాన్ని రచించి ముగించాడు. గాయత్రీ మంత్రానికి ఇది ఇంకా అధికంగా పొసగుతుంది. "ధీమహి "అనే పదం ఈ మంత్రంలోనే ఉన్నది. ధ్యానిస్తున్నాము అని దీని అర్థం గాయత్రీ జపం చేసేటప్పుడు అంతా (సంధ్యాకాలాలలో) ధ్యానించడం ముఖ్యం. "ఆదిత్య మండలే ధ్యాయేత్ పరమాత్మాన మవ్యయమ్" అని ఆ సమయంలో మనం అనుసంధించే శ్లోకం దీనిని తెలియజేస్తున్నది. " ఉందియాల్ శిందియాదు ఓది యురు ఎణ్ణుమ్ అందియాల్ ఆమ్ పయన్ ఎన్ కొల్! " (మనసులో భగవంతుని ధ్యానం చేయకుండా, కేవలం మంత జపాన్ని చేస్తే, దానివల్ల ఏమి ప్రయోజనం?) అని ఆళ్వారుల పాశురం గాయత్రిని జపించేటప్పుడు ధ్యానానికి కల ప్రాధాన్యాన్ని తెలుపుతున్నది.

### 7) ఈ రెండిటి వల్ల వేదం ప్రకాశిస్తుంది

శ్రీరామాయణాన్ని మొదట కుశలవులకు వాల్మీకి నేర్పించాడు. అప్పుడు శ్లోకం "వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః" అని ఉన్నది వేదాన్ని వివరించాలి అనే దృష్టితోనే రామాయణాన్ని ప్రచారం చేశాడు, వాల్మీకి. గాయత్రీ మంత్రం కూడా వేదవిద్యనే బలపరుస్తుంది. దీనిని మార్కండేయ స్మృతి ఈ విధంగా చెబుతున్నది. " సంధ్యామాత్రప్రదానస్య పునః కాలేన కేనచిత్ ---సర్వ వేదాంత

తత్త్వవిత్" (గాయత్రి యొక్క మహిమను కారణంగా ఇతడు వేదంలో కూడా సామర్థ్యాన్ని పొందగలడు.) ఈ రీతిలో శ్రీరామాయణం, గాయత్రీమంత్రం అనే ఈ రెండు వేదాన్ని వివరించేవి, బలపరిచేవి.

### 8) రెండు పాపాలను పోగొట్టేవి

"పంచావసానా గాయత్రీ పంచపాతక నాశినీ" అనే సూక్తికి అర్థం ఏమంటే, గాయత్రీ మంత్రాన్ని ఐదు నిలుపులతో జపిస్తే, ఐదు పాతకాలు నశించిపోతాయి–అని. ఆ ఐదు నిలుపులు ఎక్కడెక్కడ అని అంటే, " ప్రణవం తరువాత, సువః –అనే పదం తరువాత, వరేణ్యం అనే పదం తరువాత, ధీమహి అనే పదం తరువాత, మంత్రం చివరిలో – అని ఈ విధంగా 5 విరామాలతో గాయత్రిని జపించాలి. ఈ విధంగానే, శ్రీరామాయణం పారాయణం కూడా పాపాలను పోగొడుతుంది – అనేది దాని పలశృతిలోని " పూజయన్ చ పఠన్ చైవ ఇతిహాసం పురాతనమ్, సర్వ పాపైః ప్రముచ్యతే " అనే సూక్తులు ఈ అర్థాన్ని తెలుపుతున్నాయి. రామాయణాన్ని పూజించేవాడు, పఠించేవాడు కూడా అన్ని పాపాల నుండి విముక్తుడు అవుతాడు అని దీనివల్ల తెలుస్తున్నది.

### 9) రెండిటిలోనూ 24 అనే సంఖ్య ముఖ్యమైనది

సంఖ్యలో కూడా గాయత్రీ మంత్రానికి, శ్రీరామాయణానికి పోలిక ఉన్నది. గాయత్రీ మంత్రంలో సరిగా 24 అక్షరాలు ఉన్నాయి. ఒక్కొక్క పాదంలోనూ 8 అక్షరాలు చొప్పున, మొత్తం మూడు పాదాలలోను మొత్తం 28 అక్షరాలు ఉన్నాయి. "చతుర్వింశత్యక్షరా గాయత్రీ" అని వేదవాక్యంక కూడా ఉన్నది. వాల్మీకి రామాయణం లో కూడా ఈ విధంగానే 24 అనే అంకకు ప్రాధాన్యం ఉన్నది. "చతుర్వింశత్ సహస్రాణి శ్లోకానా ముక్తవాన్ ఋషిః" అని చెప్పినట్టుగా 24 వేల

శ్లోకాలు శ్రీరామాయణంలో ఉన్నవి. ఒక్కొక్క గాయత్రీ మంత్రాక్షరానికి, ఒక్కొక్క వేయి చొప్పున వ, రామాయణంలో 24 అక్షరాలు ఉన్నాయి. గాయత్రీ ఒక్కొక్క వేయి గాయత్రీ మంత్రంలోని ఒక్కొక్క అక్షరంతో ప్రారంభం అవుతున్నది. ఈ విధంగా ఉండే నాలుగు లోకాలను కూర్చి, ఈ గాయత్రీ రామాయణం అనుసంధింపబడుతున్నది.

ఈ విధంగానే ఇంకా పలు సామ్యాలు ఈ రెండిటి మధ్య ఉన్నందువల్ల, గాయత్రీ మంత్రం, సీతా చరిత్ర మనవడే శ్రీరామాయణంతో పోలి ఉన్నది.

★★★★★

# 10. గాయత్రి – శ్రీరామాయణమ్ –3

**సామ్యేనాద్యంతయోః, శ్రీరఘువరచరితం బ్రాహ్మతేజఃప్రకాశాత్**
**సౌమంత్ర్యాభిప్రసక్త్యాఽ పి చ గురువరసంపూజితత్వాత్ సదైవ,**
**స్కాందే సంకీర్త్యమానాత్ కమలభవసతీసమ్మతత్వాత్ మహత్వాత్**
**శ్రీగాయత్రీసమానం ప్రవిలసతితరా మాదికావ్యం సుపూజ్యమ్**

## 1) ఈ రెండిటిలో మొదటి వర్ణం ఒకటే

గాయత్రీ మంత్రం "త" అనే అక్షరంతో ఆరంభం అవుతున్నది, "యాత్ "అని ముగుస్తున్నది. సంక్షేప రామాయణం కూడా "తపస్" అనే పదంతో ఆరంభించి, "ఈయాత్" అనే పదంతో పూర్తి అవుతున్నది. అందువల్ల అది కూడా "త" అనే అక్షరంతో ఆరంభమై, " యాత్ "అనే దానితో పూర్తి అవుతున్నది.

## 2) ఈ రెండిటి వల్ల బ్రహ్మ తేజస్సు వ్యాపిస్తుంది

శ్రీరామాయణంలో ప్రస్తావింపబడిన ఒక వృత్తాంతం చివరిలో "ధిగ్బలం క్షత్రియ బలం బ్రహ్మ తేజో బలం బలమ్" అని విశ్వామిత్రుడు పలికినట్లుగా ఉన్నది. క్షత్రియుల యుద్ధ బలం బ్రాహ్మణుల తేజోబలానికి ముందు ఎందుకు పనికి రాకుండా పోయింది– అని దీని అర్థం. ఈ విధంగా రామాయణం బ్రహ్మ తేజస్సును కీర్తించింది. గాయత్రీ జపంకూడా, చేయగా చేయగా, బ్రాహ్మణ్యం అనే తేజస్సు కూడా వృద్ధి అవుతుంది. అందుచేత గాయత్రి కూడా బ్రహ్మ తేజస్సును వృద్ధి చేస్తుంది.

## 3) రెండిటిలోనూ సుమంత్ర సేవనం ఉన్నది

గాయత్రి అనేది చాలా మహిమను కలిగిన మంత్రమై ఉన్నది. అందువల్ల అది సుమంత్రం అనబడుతున్నది. దానిని మనం "హస్తైః వహంతీం భజే" అని, "

ప్రాతః ధ్యాయామి గాయత్రీ మ్"అని, గచ్ఛ దేవి యథాసుఖమ్"అని పలు రీతులుగా ఉపచరించడం వల్ల ఇందులో సుమంత్ర సేవ సంభవిస్తున్నది. శ్రీరామాయణంలో అయితే, సుమంతుడు అనే రథసారథి రాజకుటుంబంలో సేవను చేయడం వల్ల సుమంత్రాసేవనం ఇందులో సిద్ధించింది.

## 4) ఈ రెండు ఆచార్య పూజితాలు

భగవద్రామానుజులు ఒక సంవత్సర కాలం తిరుమల క్రింద తిరుమలనంబి దగ్గర శ్రీరామాయణంలో ఉండే విశేషాలను శ్రవణం చేశారట. ఒక శ్లోకం కూడా విడువకుండా ఆచార్యుల వద్ద శ్రీరామాయణంలోని అర్థాలను విని పొందే సంప్రదాయం ఈనాటికి వంశపారంపర్యంగా, గురు శిష్య పరంపరగా కొన్ని శ్రీవైష్ణవ కుటుంబాలలో కొనసాగుతూ వస్తున్నది. అదే భగవద్రామానుజులు మిక్కిలి వృద్ధులుగా ఉండే స్థితిలో కూడా, ఎంతో శ్రమపడి పైకి లేచి, గాయత్రీ మంత్రాన్ని జపించి, సూర్యునకు అర్ఘ్యాన్ని ఇచ్చేవారు అని వారి చరిత్ర చెబుతున్నది. అందువల్ల మన సంప్రదాయంలో గాయత్రికి, శ్రీరామాయణానికి ఎంతో ప్రాధాన్యం ఉన్నది.

## 5) ఈ రెండు స్కాంద పురాణంలో కీర్తింపబడ్డాయి

స్కాంద పురాణం ఉత్తరఖండంలో నారద సనత్కుమార సంవాదం అనే భాగంలో, ఐదు అధ్యాయాలు పూర్తిగా రామాయణ మాహాత్మ్యాన్ని వర్ణిస్తున్నవి. అందులో ఉదాహరణకు ఒక శ్లోకం–

**"రామాయణేతి యన్నామ సకృదభ్యుచ్యతే యదా,**
**తదైవ పాప నిర్ముక్తో విష్ణులోకం స గచ్ఛతి"**

ఒక్కసారి శ్రీరామాయణం అనే పేరును చెబితే చాలు, ఆ విధంగా చెప్పేవాడు పాపం నుండి విముక్తుడై, విష్ణులోకాన్ని చేరుతాడు– అని దీని అర్థం. ఇదే పురాణంలో గాయత్రీ దేవి బ్రహ్మ దేవుని వివాహం చేసుకున్న కథ ఉన్నది.

### 6) ఈ రెండు బ్రహ్మదేవుని పత్నీస్థానీయాలు

శ్రీరామాయణాన్ని గూర్చి చెప్పేటప్పుడు "మచ్ఛందాదేవ తే బ్రహ్మన్! ప్రవృత్తేయం సరస్వతీ" అనే బ్రహ్మ అన్నాడు దీని అర్థం ఏమంటే–" ఓ వాల్మీకి మహర్షీ! నా సంకల్ప వశంగానే సరస్వతీదేవి రామాయణంగా అవతరించింది. ఈ "మానిషాద" అనే మాట నా సంకల్పన సారంగా ఏర్పడింది – అని అర్థం. అయినప్పటికీ, సరస్వతి విద్యాదేవత అయినందున, కావ్యాలను సరస్వతీ దేవి ప్రవృత్తులుగానే చెప్పడం పరిపాటి. " పాదన్యాసం ప్రథమ మనఘా భారతీ యత్ర చక్రే" అనే పాదుకా సహస్ర సూక్తిలో సరస్వతీ దేవి రామాయణం అనే రూపంలో వాల్మీకి మునిద్వారా తన పాదన్యాసాన్ని పెట్టింది –అని శ్రీదేశికులు దీనిని ఆమోదిస్తూ పలికారు. గాయత్రీ దేవి కూడా బ్రహ్మకు ఇంకొక భార్య అనేది పౌరాణిక క్రమం. స్కాంద పురాణంలో కూడా ఈ వృత్తాంతం ఉండడం ఇంతకు ముందే సూచింపబడింది.

### 7) ఈ రెండు అంతు లేని మహిమ కలిగినవి.

ఈ విషయం ఇంతకు ముందే పలు ప్రమాణాల ద్వారా నిరూపింపబడింది.

ఈ విధంగా ఉండే పలు సామ్యాల వల్ల గాయత్రీ మంత్రంతో సమానమై, మిక్కిలి పూజించదగిన శ్రీరామాయణం చాలా గొప్పగా ప్రకాశిస్తున్నది.



# 11. సంధ్యావందనంలో దిక్కులకు నమస్కారం ఎందుకు?

ప్రతిదినం మూడు సంధ్యలలోనూ సంధ్యావందనం చేసేటప్పుడు, గాయత్రీమంత్రజపం పూర్తి అయిన తరువాత, "సంధ్యాయై నమః, సావిత్ర్యై నమః, గాయత్ర్యై నమః, సరస్వత్యై నమః" అని నాలుగు దిక్కుల వైపు తిరుగుతూ, ఆత్మ ప్రదక్షిణం చేస్తాం. తరువాత కామక్రోధాలే మన చేత పాపాలను చేయిస్తాయి కనుక, వాటికి నమస్కరిస్తూ, "కామో உకార్షీత్, మన్యు రకార్షీత్ నమో నమః" అని మనలను ఆ విధంగా ప్రేరేపించవద్దని వాటిని ప్రార్థిస్తాము.

ఆ తరువాత దిక్కులకు నమస్కారం చేస్తాము. "ప్రాచ్యై దిశై నమః, దక్షిణాయై దిశై నమః, ప్రతీచ్యై దిశై నమః, ఉదీచ్యై దిశై నమః, ఊర్ధ్వాయ నమః, అధరాయ నమః, అంతరిక్షాయ నమః, భూమ్యై నమః, విష్ణవే నమః" అంటూ ఆయా దిక్కుల వైపు తిరిగి, ఆయా దిగ్దేవతలను ఉద్దేశించి నమస్కారం చేస్తాము.

ఒక్కొక్క దిక్కులోను ఎందరో వేద విదులైన బ్రాహ్మణులు ఉన్నారు ఒక్కొక్క దిక్కులోను ఎన్నో దివ్య క్షేత్రాలు ఉన్నాయి. ఒక్కొక్క దిక్కులోను ఎందరో అర్చామూర్తులు, మనం అభిమానించే అర్చారూపాలు ఉన్నాయి.

హనుమంతుడు "ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై తాం దిశం ప్రతి" అని సీతాదేవి ఉండే దక్షిణ దిక్కు వైపు తిరిగి నమస్కారం చేశాడు అని శ్రీరామాయణం చెబుతున్నది.

మనం దక్షిణం వైపు తిరిగి నమస్కరించామంటే, దక్షిణ దిక్కులో వేంకటాచలం ఉన్నది, అక్కడ వేకటేశ్వరుడు ఉన్నాడు. వారికి నమస్కరిస్తున్నాం అన్నమాట. ఉత్తర దిక్కు వైపు తిరిగి నమస్కరించామంటే, అయోధ్య, ద్వారక, మధుర మొదలైన ఎన్నో దివ్య క్షేత్రాలు ఉన్నాయి. వాటికి, అక్కడ ఉండే భగవన్మూర్తులకు నమస్కరించామన్న మాట. పడమటి దిక్కు వైపు తిరిగి

నమస్కరించామంటే, ద్వారక మొదలైన దివ్యదేశాలు ఉన్నాయి, అక్కడ భగవంతుని మూర్తులు ఉన్నాయి. వాటికి నమస్కరిస్తున్నామన్న మాట. తూర్పు దిక్కు వైపు తిరిగి నమస్కరిస్తే, జగన్నాథం మొదలైన క్షేత్రాలు, అక్కడ ఉండే భగవంతుని రూపాలు ఉన్నాయి, వాటికి నమస్కరిస్తున్నామన్న మాట. భక్తులమైన మనం ఆ విధంగానే భావించాలి, భావిస్తాము కూడా. కేవలం దిక్కులకు నమస్కారం చేస్తున్నాము అని అర్థం కాదు.

ఈ విధమైన ప్రక్రియ ఇతర మతాలలో కూడా ఉండడాన్ని గమనించవచ్చు. మన దేశంలో ఉండే తురుష్కుడు ప్రార్థన చేసేటప్పుడు పడమటి దిక్కువైపు తిరిగి నమస్కారం చేస్తాడు. ఎందుకోసం? అంటే, అతడు ఉండే చోటు భారతదేశం కనుక, భారతదేశానికి మక్కా అనే పుణ్యక్షేత్రం పడమటి దిక్కులో ఉన్నది కనుక, ఆ పుణ్యక్షేత్రానికి నమస్కరించడంకోసం, అది ఉండే పడమటి దిక్కు వైపు తిరిగి నమస్కారం చేస్తాడు. అతనిని దక్షిణ దిక్కు వైపు తిరిగి నమస్కరించమని అంటే చేస్తాడా? చేయనే చేయడు. ఎందుకోసం? ఆ వైపు అతడు ఆరాధించే పుణ్యక్షేత్రం లేదు కనుక. మనం కూడా, సంధ్యావందనంలో ఆ విధంగానే మన పుణ్యక్షేత్రాలను ఉద్దేశించి, అక్కడ ఉండే భగవంతుని రూపాలను ఉద్దేశించి నమస్కరిస్తున్నామన్న మాట. మనకైతే, మనం ఉండే చోటుకు అన్ని వైపులా పుణ్యక్షేత్రాలు ఉన్నాయి. భగవంతుని దివ్యమూర్తులు ఉన్నాయి. అందువల్ల మనం అన్ని వైపులా తిరిగి నమస్కరిస్తున్నాము.

ఇంతే కాదు, పైదిక్కు వైపు తిరిగి నమస్కరిస్తున్నామంటే, ఆ దిక్కులో ఉండే భగవంతుని రూపాలను ఉద్దేశించి నమస్కరిస్తున్నాము. ఇదే విధంగా, క్రింది దిక్కులో కూడా భావించాలి. అందువల్లనే చిట్టచివరిలో అంతటా వ్యాపించి ఉండే పరమాత్మ స్వరూపమైన విష్ణుస్వరూపానికి "విష్ణవే నమః" అని నమస్కారం చేస్తున్నాము. ఈ ప్రక్రియనే హనుమంతుడు "ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై తాం దిశం ప్రతి" అని తాను ఆచరించడం ద్వారా మనకు ఉపదేశించాడు. స్వస్తి.



# 12. ఆఱాయిరప్పడి వ్యాఖ్యానవైభవమ్

**శైల్యా రత్నప్రవాళాభిధనవవిధయా ఽ కర్షణీయా, శఠారేః**
**ప్రాదుర్భూతా శ్రుతీనాం ద్రమిడవచసి యా లక్ష్మణార్యాజ్ఞయా యా,**
**యా సంక్లిప్తాఽ ప్యభిజ్ఞైః సకలగురువరైః సమ్మతా, షట్సహస్రైః**
**గ్రంథైః క్లప్తా తథా యా కురుకగురువరైః, వర్ధతాం సర్వదా సా.**

(మణిప్రవాళశైలి అనే నూతనమైన క్రమాన్ని కలిగినందున ఆకర్షణీయమైనది, నమ్మాళ్వార్ల వలన ఆవిర్భవించిన శ్రుతికి ద్రావిడభాషలో భగవద్రామానుదజుల అనుగ్రహంతో ఆవిర్భవించినది, క్లుప్తమైనది అయినప్పటికీ ఆచార్యులు అందరికీ అభిమతమైనది, ఆఱువేల గ్రంథ సంఖ్యతో కూడినది, కురుకేశార్యులు అనే ఆచార్యవర్యులు అనుగ్రహించిన ఆఱాయిరప్పడి అనే వ్యాఖ్యానం ఎల్లప్పుడూ వర్ధిల్లాలి.)

**శ్రీమద్విష్ణుపురాణగీతికలనా మాశ్రిత్య సద్ద్రావిడీ**
**వ్యాఖ్యాం శ్రీకురుకేశ్వరః శఠజితః చక్రే శ్రుతీనాం మునేః,**
**తద్గ్రంథద్వయవాచ్యమానవిషయే యద్ద్యోతతే తుల్యతా**
**సా స్యాత్ కారణ మత్ర తద్గణనయా తట్టీకనోల్లేఖనే.**

శ్రీవిష్ణుపురాణశ్లోకసంఖ్యను, అంటే, ఆఱువేల సంఖ్యను ఆశ్రయించి, చక్కని ద్రావిడ భాషలో నమ్మాళ్వారులు అనుగ్రహించిన ద్రావిడ వేదానికి వ్యాఖ్యానాన్ని కురుకేశార్యులు అనే పేరును కలిగిన తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ ఆచార్యులు రచించారు. శ్రీవిష్ణుపురాణం, తిరువాయ్ మొழி అనే రెండు గ్రంథాల మధ్య చెప్పబడే విషయంలోని సామ్యం ఏదైతే ఉన్నదో, అదే విష్ణుపురాణ సంఖ్యలో ఆరఱాయరప్పడి వ్యాఖ్యానాన్ని రచించడానికి కారణం అయినది.)



**తెళ్ళారుమ్ ఞాన త్తిరుక్కురుకైప్పిరాన్**
**పిళ్ళాన్ ఎతిరాశర్ పేరరుళాల్– ఉళ్ళారుమ్**
**అన్బుడనే మాఱన్ మఱైప్పొరుళై అన్ఱురైత్తదు**
**ఇన్బమికు మాఱాయిరమ్ (ఉపదేశ రత్తినమాలై –41)**

(పూర్ణమైన వివేకం కల జ్ఞానాన్ని కలిగిన తిరుక్కురుకై పిరాన్ పిళ్ళాన్ శ్రీరామానుజుల గొప్ప అనుగ్రహంతో అనన్య ప్రయోజనమైన, నిరవధికమైన ప్రీతితో నమ్మాళ్వారుల వేదరూపమైన తిరువాయ్ మొళి ప్రబంధంలోని అర్థాన్ని శ్రీ రామానుజులు జీవించి ఉన్న కాలంలోనే అనుగ్రహించారు. ఇది రసఘనమైన వ్యాఖ్యాన గ్రంథం)

పై పాశురాన్ని మణవాళ మహామునులు ఉపదేశరత్తిన మాలై అనే ప్రబంధంలో అనుగ్రహించారు.

ఈ పాశురంలో మణవాళ మహామునులు ఆఱాయిరప్పడి అనే తిరువాయ్ మొళి దివ్యప్రబంధ వ్యాఖ్యానంలోని వైభవాన్ని ప్రస్తుతించారు. ఇందులో వారు ఆ వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన పిళ్ళాన్ జ్ఞానవైభవాన్ని, వారు ఈ వ్యాఖ్యానాన్ని అనుగ్రహించడానికి గల కారణాన్ని, దానికి పెద్దల సమ్మతి ఉండే విషయాన్ని తెలియజేశారు.

తిరువాయ్ మొళి అనే ప్రబంధం నమ్మాళ్వారులు అనుగ్రహించిన ప్రబంధం. ఇది సామవేద రూపమైనది దీనిని వ్యాఖ్యానించడానికి ఆ ప్రబంధంలోనూ, అంతేకాక, దానికి మూలంగా చెప్పబడే తిరువాయ్ మొழி ప్రబంధంలోనూ పరిపూర్ణమైన జ్ఞానాన్ని కలిగి ఉండాలి. ఇటువంటి జ్ఞానాన్ని కలిగినవారు, పిళ్ళాన్ – అనే విషయాన్ని మణవాళ మహామునులు "తెళ్ళారుమ్ ఞాన త్తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్" అనే సూక్తి ద్వారా తెలియజేశారు.

ఆఱాయిరప్పడి వ్యాఖ్యానవైభవమ్

జ్ఞానం ఉంటే చాలదు, అది శిష్టులైన ఆచార్యుల సన్నిధిలో సంపాదించినదై, వారి సమ్మతిని, అభిమానాన్ని పొంది ఉండాలి. అప్పుడే అది విలువ కలిగినది అవుతుంది. అటువంటివారు రచించిన గ్రంథాలకే ఉపాదేయత ఉంటుంది. ఈ యోగ్యతను కలిగినవారు పిళ్ళాన్ అనే విషయాన్ని "ఎతిరాశర్ పేరరుళాల్" అని అంటూ మణవాళ మహాంమునులు తెలిపారు.

ఇటువంటి యోగ్యతలు ఉన్నా, గ్రంథ రచనకు సరిపోదు. ఏ గ్రంథాన్ని రచించినా అది చిరకాలం నిలచి ఉండాలంటే, అందరి మన్ననను పొందాలి అంటే, సమాజానికి ఉపయోగపడాలి అంటే, అది నిఃస్వార్థమైన బుద్ధితో రచించినదై, ఇతరులకు ఉపయోగపడాలి, దానివల్ల ఇతరులు లాభపడాలి అనే భావంతో రచింపబడి ఉండాలి. ఇటువంటి స్వభావాన్ని పిళ్ళాన్ కలిగి ఉన్నారు, ఏ విధమైన ఖ్యాతిని, లాభాన్ని, పూజను ఆశించకుండా, లోక శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని, తాము ఈ వ్యాఖ్యానాన్ని రచించారు అనే విషయాన్ని మణవాళ మహాంమునులు " ఉళ్ళారుమ్ అన్బుడనే మాఱన్ మఱైప్పొరుళై" అనే సూక్తి ద్వారా తెలిపారు.

ఇటువంటి విలక్షణమైన వ్యాఖ్యానమే ఆఱాయిరప్పడి వ్యాఖ్యానం.

ఈ వ్యాఖ్యానానికి కల ఇంకొక వైలక్షణ్యాన్ని కూడా ఇక్కడ మణవాళ మహాంమునులు తెలియజేశారు. అది ఏమంటే, ఈ వ్యాఖ్య రామానుజులు జీవించి ఉండగానే రచింపబడినది. మిగిలిన ఏ వ్యాఖ్యానాలకు లేని గొప్పతనం ఇది. ఇందువల్ల సాక్షాత్తు శ్రీ రామానుజుల కటాక్షాన్ని, సమ్మతిని పొందినది ఈ వ్యాఖ్యానం.

పిళ్ళాన్ అనుగ్రహించిన ఆఱాయిరప్పడి వ్యాఖ్యానానికి గల ఇంకొక అతిశయాన్ని కూడా మణవాళ మహాంమునులు తమ సూక్తిలో అనుగ్రహించారు. అది ఏమంటే, ఈ ఆఱాయిరప్పడి వ్యాఖ్యానం రసఘనం అయినది. సహజంగానే

నమ్మాళ్వారుల ప్రబంధం తిరువాయ్ మొళి "అమర్ శువై ఆయిరమ్" (శబ్దరసం, అర్థరసం చిందే వేయి పాశురాలు) అనే విధంగా రసఘనమై ఉన్నది. లోకులపై ఉండే ఎంతో ప్రేమతో, నమ్మాళ్వారుల విషయంలోనూ, తిరువాయ్ మొళి ప్రబంధం విషయంలోనూ తమకు కల ప్రేమతో, భక్తితో పిళ్ళాన్ ఈ వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన అందువల్ల ఈ వ్యాఖ్యానం ఇంత రస ఘనంగా సమకూడింది అని పిళ్లైలోకమ్ జీయర్ వివరించారు.

నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధానికి ఐదు వ్యాఖ్యానాలను ఐదుగురు పూర్వాచార్యులు రచించారు. పిళ్ళాన్ ఆఱాయిరప్పడి వ్యాఖ్యానాన్ని, 6000 గ్రంథ పరిమితిలో నంజీయర్ ఒన్బదినాయిరప్పడి వ్యాఖ్యానాన్ని, 9వేల గ్రంథ పరిమితిలో నంబిళ్ళై ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యానాన్ని 36వేల గ్రంథ పరిమితిలో, పెరియ వాచ్చాన్ పిళ్ళై ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానాన్ని 24 వేల గ్రంథ పరిమితిలో, అళగియ మణవాళ చ్చీయర్ పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానాన్ని 12వేల గ్రంథ పరిమితిలో అనుగ్రహించారు.

ప్రస్తుతంలో, పిళ్ళాన్ తమ వ్యాఖ్యానాన్ని 6000 గ్రంథ పరిమితిలో, అంటే, విష్ణుపురాణంశ్లోకపరిమితిలో రచిందడానికి కారణం ఏమి? అనే విషయాన్ని కూడా ఇక్కడ గమనించాలి. భగవద్రామానుజులు బ్రహ్మసూత్రాలకు శ్రీభాష్య వ్యాఖ్యానాన్ని అనుగ్రహించేటప్పుడు పలు సందర్భాలలో, ప్రత్యేకించి సిద్ధాంతస్థాపనను చేసే సందర్భాలలో, శ్రీ విష్ణు పురాణ సూక్తులను ఎన్నిటినో ప్రస్తావించి విషయ నిరూపణ చేయడం జరిగింది. ఈ విధంగా వారు విష్ణు పురాణ సూక్తులను ఉదాహరించటానికి కారణం బ్రహ్మసూత్రాలకు, శ్రీవిష్ణుపురాణానికి మధ్య ఉండే ప్రతిపాద్య విషయ సామ్యాన్ని ఆధారంగా చేసుకునేకదా. ఆ విధంగానే, ఇక్కడ పిళ్ళాన్ తమ వ్యాఖ్యానాన్ని విష్ణుపురాణ శ్లోక పరిమితిలో రచించడం తిరువాయ్ మొళి

ప్రబంధానికి, శ్రీవిష్ణుపురాణానికి మధ్య ఉండే ప్రతిపాద్య విషయ సామ్యం ఒక కారణం కావచ్చు – అని భావించడంలో అడ్డులేదు. నంబిళ్ళై మొదలైన పూర్వాచార్యులు పలువురు తిరువాయ్ మొళి ప్రబంధాన్ని వ్యాఖ్యానించేటప్పుడు ఎన్నో సందర్భాలలో శ్రీవిష్ణుపురాణ సూక్తులను ఉదాహరించి వ్యాఖ్యానించడాన్ని మనం గమనించవచ్చు. ఈ విధంగా వారు వ్యాఖ్యానించడడానికి పిళ్ళాన్ తమ వ్యాఖ్యానాన్ని శ్రీ విష్ణుపురాణశ్లోక సంఖ్యలో అనుగ్రహించడం కూడా కారణం అని భావించవచ్చు కూడా.

పిళ్ళాన్ ఈ విధంగా విష్ణుపురాణ సంఖ్యలో తమ వ్యాఖ్యానాన్ని వెలయించడానికి గల కారణాన్ని నిరూపిస్తూ, పిళ్ళైలోకమ్ జీయర్, పిళ్ళాన్ పౌరాణికుల పుత్రులు కనుక పురాణ రత్నం అయిన విష్ణు పురాణంలోని శ్లోకసంఖ్యను అనుసరించి తమ వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారని అన్నారు. ఇది కూడా ఇంకొక కారణం. శ్రీరామాయణంలోని విశేషాలను పిళ్ళాన్ పితృపాదులైన పెరియ తిరుమల నంబి రామానుజులకు ఒక సంవత్సరకాలం అనుగ్రహించినట్లు చరిత్ర తెలుపుతున్నది కదా.

ఇంతవరకు ఈ ఆచాయిరప్పడి వ్యాఖ్యానానికి సంబంధించిన బాహ్యామైన కొన్ని విశేషాలను గమనించిన తరువాత, ఇందులో అంతరంగా గోచరించే కొన్ని వైలక్షణ్యాలను గమనిద్దాం.

ఏ గ్రంథం అవతరించినా, దానికి కొన్ని కారణాలు ఉంటాయి. ఈ ఆచాయిరప్పడి వ్యాఖ్యానం రూపుదిద్దుకోవడానికి కూడా మనకు కొన్ని కారణాలు కనిపిస్తాయి. ఇంతకుముందే మణవాళ మహామునులు "అన్బుడనే " ప్రేమతో) నే ఒక కారణాన్ని నిర్దేశించారు. నాథమునులనుండి అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ

వస్తున్న, ద్రావిడ వేదం అని సంప్రదాయంలో గొప్పగా గౌరవింపబడే దివ్యప్రబంధ సాహిత్యంలోని తత్వార్థాలు శ్రీరామానుజుల కాలం వరకు మౌఖికంగానే, అంటే, శిష్యాచార్య ప్రవచన క్రమంలోనే కొనసాగుతూ వచ్చాయి. అయితే, కాలక్రమేణ, జ్ఞానంలో, శ్రద్ధలో ఏర్పడిన మార్పుల కారణంగా ఈ అర్థాలు గ్రంథస్థం చేయబడితే తప్ప, అవి తరువాత తరాలవారికి నిర్దుష్టంగా అందే అవకాశం లేదు అనే భావం శ్రీరామానుజుల కాలంలోనే ఏర్పడింది. ఏ విధంగా అయితే, వేదవాక్యాలకు తగని రీతిలో అర్థ ప్రతిపాదన చేయడం జరిగిందో, ఆ విధంగానే దివ్యసూరుల ప్రబంధాలకు కూడా తగని విధంగా అర్థ ప్రతిపాదన చేయబడే ప్రమాదం కూడా కలుగవచ్చుననే భయం కూడా ఆచార్యులలో ఏర్పడినది. అప్పటికే శ్రీరామానుజులు వేదవిరుద్ధాలైన వాదాలను ఖండిస్తూ, వేదానుకూలమైన అర్థాలను తెలియజేస్తూ బ్రహ్మసూత్రాలకు శీభాష్యం అనే మహా గ్రంథాన్ని రచించడం జరిగింది. ఈ క్రమంలో ఆళ్వారుల ప్రబంధాలకు కూడా వారి హృదయాలకు అనుగుణంగా వ్యాఖ్యానాలను రచించడం ఆవశ్యకం అనే బలమైన అభిప్రాయం అప్పటి పూర్వాచార్యులలో కలిగింది. అందువల్ల వారు ఒక పర్యాయం అందరూ కలసి పిళ్ళాన్ ను ముందు పెట్టుకొని, శ్రీరామానుజులను ఆళ్వారుల ప్రబంధాలలో అంగి ప్రబంధంగా కీర్తింపబడే నమ్మాళ్వారుల తిరువాయ మొళి ప్రబంధానికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించవలసినదిగా ప్రార్థించారు. కానీ శ్రీరామానుజులు చాలా దూరదృష్టిని కలిగినవారు కనుక, ఆ పని తమ వల్ల జరగడం కంటే, శిష్యుల ద్వారా జరిగితే అది భవిష్యత్తులో మరింత వృద్ధి కావడానికి తగిన అవకాశం ఉంటుంది అని భావించి, ఆ విధంగా తిరువాయ్ మొళి ప్రబంధానికి సరి అయిన రీతిలో వ్యాఖ్యానాన్ని అనుగ్రహించగలిగిన సామర్థ్యం కల శిష్యులలో ఒకరైన, తమకు అభిమాన పుత్రులైన పిళ్ళాన్ ను ఆ కార్యాన్ని

నెరవేర్చవలసినదిగా ఆదేశించారు. వారి ఆదేశాన్ని శిరసా వహించిన పిళ్ళాన్ ఆఱాయిరప్పడి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు.

ఇంకొక విషయాన్ని కూడా ఇక్కడ మనం గమనించవలసి ఉన్నది. శ్రీరామానుజులు శ్రీ భాష్య గ్రంథాన్ని సంస్కృత భాషలో అనుగ్రహించారు. ఇదే క్రమంలో పిళ్ల సంస్కృత భాషలోనే తిరువాయ్ మొళి ప్రబంధానికి కూడా వ్యాఖ్యానాన్ని ఎందుకు అనుగ్రహించలేదు? లేక, తిరువాయ్ మొళి ప్రబంధం ద్రావిడ భాషలో అవతరించింది. దీనికి వ్యాఖ్యానాన్ని అదే భాషలో, అంటే, ద్రావిడ భాషలోనే పిళ్ళాన్ అనుగ్రహించి ఉండవచ్చు. ఆ విధంగా కూడా ఎందుకు చేయలేదు? ఈ రెండు భాషలలో కాకుండా, ఈ రెండు భాషలను మేళవించిన, అంటే, సంస్కృత ద్రావిడ భాషల మేలు కలయిక అయిన మణిప్రవాళ శైలిలో పిళ్ళాన్ తమ వ్యాఖ్యానాన్ని అనుగ్రహించడానికి కారణం ఏమి? అనే విచికిత్సకూడా పాఠకులకు కలుగుతుంది.

భగవద్రామానుజ సంప్రదాయం ఉభయ వేదాంత సంప్రదాయం. ఈ సంప్రదాయం శ్రీమన్నాథమునుల కాలం నుండి ప్రవర్తించింది. "నాథోపజ్ఞం ప్రవృత్తమ్" అని శ్రీదేశికులు ఈ విషయాన్ని తెలిపారు. సంస్కృత వేదాంతం, ద్రావిడ వేదాంతంగా చెప్పబడే దివ్యసూరుల దివ్య ప్రబంధాలు – అనే ఈ రెండు ఒకే విధమైన తత్వాన్ని, అంటే, శ్రీమన్నారాయణడే పరదైవం, ఆ స్వామి విషయంలోని, స్వార్థరహితమైన సేవయే తగిన, జీవుడు పొందదగిన ప్రయోజనం అనే తత్వాన్ని నిరూపిస్తున్నాయి – అనేది ఈ సిద్ధాంతంలోని ముఖ్యమైన అంశం. పిళ్ళాన్ తాము తిరువాయ్ మొళి ప్రబంధానికి ఈ ఆఱాయిరప్పడి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించేటప్పుడు, ఈ విషయాన్ని కూడా దృష్టిలో పెట్టుకున్నారు. కేవలం ఈ

ప్రబంధంలోని సాహిత్య పరమైన తాత్పర్యాన్ని తెలియజేయడం మాత్రమే చాలదు – అని ఇందులోని తాత్వికమైన అంశాలను కూడా ఉభయ వేదాంత సంప్రదాయానుగుణంగా వివరించాలి అని వారు భావించారు. అందువల్ల వారు ఈ విధమైన సమన్వయాత్మకమైన శైలిని, అంటే, మణిప్రవాళ శైలిని అనుసరించారు. కేవలం సంస్కృతంలో రచిస్తే, ఆ వ్యాఖ్యానం సంస్కృతజ్ఞులకు, పండితులకు మాత్రమే అందుబాటులో ఉంటుంది. కేవలం ద్రావిడ భాషామయంగానే తమ వ్యాఖ్యానాన్ని వెలయిస్తే, అది ద్రావిడ భాషను తెలిసినవారికి మాత్రమే ఆస్వార్యమై ఉంటుంది, ఈ విధంగా భావించిన పిళ్ళాన్, అటు పండితులకు, ఇటు ద్రావిడ భాషాభిమానులకు రెండు వర్గాల వారికి రుచించే విధంగా మణిప్రవాళ శైలిని ఎన్నుకున్నారు. దీనికి శ్రీరామానుజుల అంగీకారం కూడా లభించినది అని అనడంలో ఏ సందేహం, అడ్డు లేదు. ఇందువల్ల, ఆవశ్యకమైన సందర్భాలలో సంస్కృత వేదానికి సంబంధించిన ప్రమాణాలను, ఆళ్వారుల దివ్యప్రబంధాలలోని సూక్తులను ప్రమాణీకరించి, తత్వార్థ ప్రతిపాదనను చేయడానికి తగిన అవకాశం ఏర్పడింది. విశేషం ఏమి అంటే, తరువాతి కాలంలో ఆవిర్భవించిన విశిష్టాద్వైత సిద్ధాంతానికి శ్రీవైష్ణవ సంప్రదాయానికి సంబంధించిన ఎన్నో గ్రంథాలను పలువురు పూర్వాచార్యులు ఈ మణిప్రవాళ శైలిలోనే రచించారు.

ఈ ఆఱాయిరప్పడి వ్యాఖ్యానాన్ని పిళ్ళాన్ ఒక నిర్దిష్టమైన క్రమంలో అనుగ్రహించారు.

1) ప్రతి దశకానికి ముందు క్లుప్తంగా అవతారికా వాక్యాలను అనుగ్రహించడం. ఇందులో ఆ. దశక ప్రమేయం సంగ్రహంగా సూచింపబడుతుంది. ఈ క్రమాన్ని తరువాత వ్యాఖ్యాతలు అందరూ అనుసరించారు.

2) పాశురంలోని తాత్పర్యాన్ని సంగ్రహంగా ప్రతిపాదించడం. ఈ విధంగా తాత్పర్యాన్ని తెలిపేటప్పుడు, పాశురంలోని పదాల అన్వయక్రమాన్ని సూచిస్తూ తాత్పర్యాన్ని తెలియజేయడం.

3) ఆవశ్యకమైన సందర్భాలలో వేదాంత ప్రమాణాలను ఉట్టంకించి, విషయాన్ని వివరించడం. ఉదాహరణగా " తిడవిశుంబు" (1–1–7) అనే పాశుర వ్యాఖ్యానాన్ని గమనించవచ్చు. ఇక్కడ పిళ్ళాన్ ఎన్నో సంస్కృత ప్రమాణాలను ఉదాహరించి, పరమత నిరసనాన్ని చేశారు. పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుడు అన్ని వస్తువులలోను నియంతగా వ్యాపించి ఉంటాడని నిరూపించారు. ఈ క్రమం కూడా తర్వాత వ్యాఖ్యానాలలో కనిపిస్తుంది.

4) ఆవశ్యకమైన సందర్భాలలో వివరణ కోసం కొన్ని సంస్కృత సమాసాలను ప్రయోగించి అర్థాన్ని వివరించడం అనే క్రమం కూడా ఈ వ్యాఖ్యానంలో మనకు కనిపిస్తుంది.

5) ఆ యా దశకాలలోని ముఖ్యమైన పాశురాలను, లేక, పాశురాలలోని ప్రయోగాలను దృష్టిలో పెట్టుకుని, ఆ దశకాలలో భాసించే భగవంతుని కళ్యాణ గుణాన్ని నిర్దేశించడం.

ఉదాహరణకు మొదటి శతకంలోని "అంజిఱైయ మడనారాయ్!" అనే నాల్గవ దశకంలో అళ్వార్లు నాయకీ భావాన్ని పొంది, భగవంతుని దగ్గరకు తన సందేశాన్ని పక్షుల ద్వారా పంపుతున్నారు. ఈ దశకంలో ఆళ్వార్లు, తమ సందేశాన్ని భగవంతుని అపరాధ సహత్వం మొదలైన గుణాలను దృష్టిలో పెట్టుకుని పంపుతున్నారని పిళ్ళాన్ ఈ దశకానికి అనుగ్రహించిన అవతారికలో తెలియజేశారు.

నంబిళ్ళై మొదలైన మిగిలిన వ్యాఖ్యాతలు కూడా ఇదే గుణం ఈ దశకంలో వ్యక్తం అవుతున్నట్లుగా తెలియజేశారు. ఇటువంటి ఉదాహరణలు చాలా ఉన్నాయి.

6) ఈ విధంగా ఆయా దశకాలలోని భగవంతుని గుణాలను నిశ్చయించి పలికేటప్పుడు, ఉభయ వేదాంత సమన్వయ ప్రక్రియను దృష్టిలో పెట్టుకొని గుణ నిర్దేశాన్ని చేయడం.

దీనికి ఒక ఉదాహరణగా పైన ప్రస్తావించిన అపరాధసహత్వ గుణనిర్దేశాన్ని గ్రహించవచ్చు.

ఈ దశకంలో భగవంతుని అపరాధసహత్వ గుణాన్ని వృత్తిలో పెట్టుకుని ఆళ్వారులు ఏ విధంగా భగవంతుని దగ్గరకు తమ సందేశం పంపుతున్నారు? అనే విషయాన్ని పిళ్ళాన్ నిర్వహించిన ప్రకారం వారు అనుగ్రహించిన ఆఱాయిరప్పడి వ్యాఖ్యానంలో స్పష్టంగా కనిపించక పోయినా, దీనిని నంబిళ్ళై తమ ఈడు వ్యాఖ్యానంలో ప్రస్తావించారు. ఈ దశకంలో భగవంతుని అపరాధ సహత్వ గుణం దృష్టిలో పెట్టుకుని అళ్వార్లు తమ సందేశాన్ని పంపుతున్నారు అనే వారి వ్యాఖ్యానప్రకారానికి ఈ దశకంలోని ఏడవ పాశురం లో ఉండే " అరుళాద తిరుమాలార్ క్కు" (అనుగ్రహించని నా లక్ష్మీపతికి) అనే ప్రయోగం మూలం అని పిళ్ళాన్ అభిప్రాయం. "భగవంతుడు ఎల్లప్పుడూ లక్ష్మీదేవితో కలసి ఉండేవాడు" అనే అర్థాన్ని ఇక్కడ ప్రయోగింపబడిన "తిరుమాలార్" అనే నామం తెలుపుతున్నది. " లక్ష్మీదేవితో ఈ విధంగా నిత్యసంశ్లేషాన్ని కలిగి ఉండే భగవంతుడు ఆమె కలయికలోని వ్యామోహంలో పడి, తమను పట్టించుకోవడం లేదు, ఈ విధంగా పట్టించుకోకపోవడం లక్ష్మీదేవి ఆశ్రితుల విషయంలో పురుషకారంచేసి భగవంతుడు వారిని రక్షించేటట్టు చేస్తుంది అనే ఆమె స్వభావానికి కొరతను కలిగిస్తుంది" అనే భావంతో ఆళ్వారులు ఇక్కడ ఈ పదప్రయోగాన్ని చేశారు – అని పిళ్ళాన్ వ్యాఖ్యానించారు.

ఈ విధంగా వారు ఇక్కడ ఈ అర్థసమన్వయాన్ని చేయడానికి – శ్రీరామాయణంలోని సూక్తి, తిరువాయ్ మొళి ప్రబంధంలోని సూక్తి, రెండు మూలమే అని ఇక్కడ భావించే అవకాశం ఉన్నది – అనేది అరుంబద వివరణం.

ఇక్కడ, శ్రీరామాయణ సూక్తి మూలం అనే విషయాన్ని ముందు గమనిద్దాం. "సుగ్రీవం నాథమిచ్ఛతి" అని సుగ్రీవునితో సఖ్యాన్ని చేసుకొని, అతనిని ప్రాణమిత్రునిగా భావించి, అతని కోసం వాలిని సంహరించినవాడు, శ్రీరాముడు. అతడు తనకు మాట ఇచ్చినట్లుగా, వర్షాకాలం దాటిన తరువాత, సీతను వెతకడం కోసం తన సేనను పంపలేదు అనే కోపం వల్ల, ఆ శ్రీరాముడే, సుగ్రీవుని విషయంలో అతడు సీతను తెలిసికోవడానికి సహకరించడం లేదు అనే కారణం చేత చాలా కోపాన్ని పొంది, " హనిష్యామి సబాంధవమ్" (నీ బంధువులతో పాటుగా నిన్ను వధిస్తాను) అని అన్నాడు కదా. ఈ విధంగా సుగ్రీవుని పై ఏర్పడిన శ్రీరాముని కోపం అతనికి సంబంధించిన బంధువులపై కూడా ప్రసరించింది. ఇది భగవంతుని విషయంలో శ్రీరామాయణం తెలిపిన సూక్తి. అంటే, భగవంతునకు ఒకనిపై కలిగిన అనుకూల భావం అతని వరకు మాత్రమే పర్యవసించకుండా అతని సంబంధిసంబంధుల వరకు కొనసాగేటట్లుగానే, అతనికి ఒకనిపై కలిగిన వ్యతిరేక భావం కూడా అతని సంబంధిలసంబంధుల వరకు కొనసాగుతుంది అని ఈ సూక్తి తెలుపుతున్నది.

ఇదే క్రమంలో పిళ్ళాన్ ఇక్కడ ఆళ్వారుల సూక్తిని సమన్వయించి అర్థాన్ని చెప్పారు. ఇక్కడ తేడా ఏమంటే, శ్రీరామాయణంలోనిది భగవంతుని సూక్తి కనుక అది భగవంతుని కోపాన్ని గూర్చి వివరించగా, ప్రస్తుతంలోని ఆళ్వారుల సూక్తి భగవత్ భక్తుల సూక్తి కనుక భగవద్భక్తులకు కలిగే కోపక్రమాన్ని తెలుపుతున్నది. భగవంతుని కోపం సంబంధి సంబంధుల వరకు కొనసాగేటట్లుగానే, భగవద్భక్తుల కోపం కూడా భగవంతుని వరకే నిలువకుండా, ఆ స్వామికి సంబంధించిన భక్తులపై

కూడా ప్రసరిస్తుంది. ఈ క్రమంలో పరాంకుశ నాయకకు భగవంతుని పై కలిగిన కోపం, ఆ భగవంతునితో ఎల్లప్పుడూ కలసి ఉండే లక్ష్మీదేవి పై కూడా ప్రసరించి, " ఈమె వల్లనే భగవంతుడు నన్ను పట్టించుకోకుండా ఉన్నాడు" అని లక్ష్మీదేవిని కూడా తప్పుపట్టే అవధికి చేరింది. అందువల్లనే ఇక్కడ ఆళ్వార్లు లక్ష్మీసంబంధాన్ని పురస్కరించుకుని భగవంతుని నిర్దేశించారు – అనేది పిళ్ళాన్ వివరణం. ఈ వివరణం పిళ్ళాన్ కు శ్రీరామాయణ సూక్తులను దివ్యసూరి సూక్తులతో కలిపి సమన్వయం చేయడంలో కల అసాధారణమైన సామర్థ్యాన్ని తెలుపుతున్నది.

ఇక, పిళ్ళాన్ చేసిన ఈ నిర్వాహం నమ్మాళ్వార్లు ఈ ప్రబంధంలోనే అనుగ్రహించిన వేరొక సూక్తితో పొసగుతున్నది అనేది కూడా ఒక ఆశ్చర్యకరమైన అంశం. ఈ ప్రబంధంలోనే ఒకచోట ఆళ్వారులు స్వయంగా " తిరుమాలాల్ అరుళప్పట్ట శడగోపన్" (లక్ష్మీ నాథునిచే అనుగ్రహింపబడిన శఠకోపులు) అని అంటూ తాము లక్ష్మీదేవి పురుషకారం కారణంగా భగవంతునిచే అనుగ్రహింపబడ్డామని అన్నారు. అది భగవంతునిపై అనుకూలమైన భావం కలిగిన సందర్భం ఇప్పుడు భగవంతునిపై కోపం ఏర్పడిన సందర్భం కనుక, దానికి తగినట్లుగా లక్ష్మీదేవి పురుషకారంచేయ నందు వల్లనే తమకు భగవంతుని అనుగ్రహం కలుగలేదని అంటున్నారు. అక్కడ, ఇక్కడ కూడా ఒకే విధమైన "తిరుమాల్" అనే పదాన్ని ఆళ్వారులు ప్రయోగించడానికి దృష్టిలో పెట్టుకొని పిళ్ళాన్ ఈ వివరణాన్ని అనుగ్రహించారని మనం భావించవచ్చు. ఈ వివరణ వారికి ఈ ప్రబంధ ప్రమేయంలో ఉండే సమగ్రమైన, అతిగాఢమైన అవగాహనకు తార్కాణం అని అనడంలో ఏ సందేహం లేదు.

ఇటువంటి గంభీరమైన, అందమైన అర్థసమన్వయాలు ఈ ఆఱాయిరప్పడి వ్యాఖ్యానంలో మనకు చాలా కనిపిస్తాయి.

సంగ్రహంగా ఇది ఆఱాయిరప్పడి వ్యాఖ్యాన వైభవం.



# 13. తిరువాయ్ మొళ్గి – శ్రీరంగనాథుడు

**శ్రీవాగుక్తిసహస్రకే శఠజితా నైకాని లక్ష్మీపతేః**
**క్షేత్రాణి ప్రణుతాని యద్యపి, విశిష్టం తత్ర రంగం, తతః,**
**తద్గాథాప్రతిపాద్యముఖ్యవిషయః శ్రీరంగనేతుః హరేః**
**సత్కల్యాణగుణౌఘ ఇత్యభిహితం భట్టార్యసద్దేశికైః.**

(నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్ మొళి దివ్యప్రబంధంలో భగవంతునకు సంబంధించిన అనేకమైన దివ్య క్షేత్రాలు వర్ణింపబడినప్పటికీ, వాటిలో విశిష్టమైనది శ్రీరంగమే. అందువల్లనే, "తిరువాయ్ మొళి దివ్య ప్రబంధంలో ఉండే వేయి పాశురాలలో ముఖ్యమైన ప్రతిపాద్య విషయం శ్రీరంగనాథుని కళ్యాణగుణవర్ణనమే " అని శ్రీపరాశరభట్టర్ అనే ఆచార్యులు అనుగ్రహించారు.)

**యే కల్యాణగుణాః శఠారికవినా శ్రీరంగిణః సంస్తవే**
**శ్రీవాగుక్తిసహస్రకే ఽ త్ర పరతాసౌలభ్యముఖ్యాః స్తుతాః,**
**తాన్ సర్వాన్ నిగమాంతదేశికగురుః నిక్షిప్య తద్యోగిని**
**శ్రీరంగేశ్వరపాదుకాస్తుతివరం చక్రే మనోజ్ఞం విదామ్.**

(నమ్మాళ్వారులు శ్రీరంగనాథుని స్తుతిరూపమైన తిరువాయ్ మొళి ప్రబంధంలో శ్రీరంగనాథుని విషయంగా పరత్వం సౌలభ్యం మొదలైన ఏ కళ్యాణ గుణాలను స్తుతించారో, వాటిని అన్నిటిని శ్రీవేదాంతదేశికులు ఆ నమ్మాళ్వారులలో ఆరోపించి, శ్రీరంగనాథ పాదుకా సహస్రం అనే, విద్వాంసులకు ఆనందాన్ని కలిగించే గొప్ప స్తోత్రాన్ని అనుగ్రహించారు.)

**రంగేందోః పాదుకాత్వం శఠమథనమునౌ యుజ్యతే యః స్వకీయ–**
**శ్రీవాగుక్తిప్రబంధే పదయుగవిభవం రంగిణో సంరరక్ష,**

**తస్మాచ్ఛ్రీవేంకటేశాభిధకవితిలకః స్వస్య పాదూసహస్రే**
**ప్రోవాచ శ్రీశఠద్విట్ హరిచరణపరిత్రాయకాభేదభావమ్.**

శ్రీరంగనాథుని పాదుకా భావం నమ్మాళ్వారుల విషయంలో చెప్పడం చాలా యుక్తంగా ఉంటుంది. ఎందుకంటే, వారు, తమ తిరువాయ్ మొళి ప్రబంధంలో శ్రీరంగనాథుని పాదాల వైభవాన్ని, అంటే ఆ పాదాలే మనకు ఉపాయం, ఉపేయం అనే విషయాన్ని, చక్కగా నిరూపించి, ఆ పాదాల వైభవాన్ని రక్షించారు. అందువల్లనే వేంకటేశులు అనే పేరు కలిగిన, వేదాంతదేశికులు అనే గొప్ప కవులు తమ పాదుకాసహస్రంలో నమ్మాళ్వారులకు శ్రీరంగనాథుని పాదుకలకు మధ్య అభేదాన్ని అనుసంధించారు)

**ప్రోక్తా యే పరతాదయః శఠజితః సాహస్రకే శ్రీపతేః**
**తే సర్వే ఽ పి దశ ప్రయాంతి సుగుణాః శ్రీరంగనాథే ఽ న్వయమ్,**
**అంశో ఽ యం దశకే ఽ త్ర సప్తమశతస్థే సుస్ఫుటం భాసతే**
**తద్వ్యాఖ్యాన మిమం నిరూపయతి నః సమ్యక్ గురూణాం మహత్.**

(నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్ మొళి ప్రబంధంలో, భగవంతుని విషయంలో చెప్పబడిన పరత్వం మొదలైన గుణాలు ఏవైతే ఉన్నాయో, అవి అన్నీ కూడా, శ్రీరంగనాధథునిలో అన్వయాన్ని పొందుతున్నాయి. ఈ విషయం ఈ ప్రబంధంలోని ఏడవ శతకంలో ఉండే రెండవ దశకంలో స్పష్టంగా తెలుస్తున్నది. ఆ దశకానికి మన పూర్వాచార్యులు చేసిన గొప్ప వ్యాఖ్యానం దీనిని నిరూపిస్తున్నది.).

**"వాన్దికఴుమ్ శోలై మదిళ్ అరంగర్ వణ్ పుకళ్ మేల్**
**ఆన్ఱ తమిళ్ మఱైగళ్ ఆయిరముమ్ –**
**ఈన్ఱ ముదల్ తాయ్ శడగోపన్ మొయ్ మ్బాల్ వళర్ త్త**
**ఇద త్తాయ్ ఇరామానుశన్"**

(ఆకాశమంత ఎత్తులో ఎదిగిన తోటలను చుట్టూ కలిగిన, ప్రాకారాలతో పరివేష్ఠింపబడి ఉండే శ్రీరంగంలో నివసించే శ్రీరంగనాథుని అందమైన కల్యాణ గుణాలను ప్రమేయంగా కలిగిన, ద్రావిడ వేద రూపాలైన వేయి పాశురాలను ప్రసవించిన కన్న తల్లి శఠకోపులు, దానిని ప్రేమతో పెంచిన తల్లి భగవద్రామానుజులు)

ఈ పాశురం, శ్రీపరాశర భట్టారకులవారిచే అనుగ్రహింపబడింది. తిరువాయ్ మొళి దివ్యప్రబంధంలోని ప్రమేయాన్ని నిర్ధారణ చేస్తూ, వారు అనుగ్రహించిన పాశురం, ఇది. ఇందులో, ఈ ప్రబంధం మొత్తం, శ్రీరంగనాథుని ఉద్దేశించి రచింపబడినది అని, ఇది ఆ స్వామి కళ్యాణ గుణాలను కీర్తిస్తున్నదని తెలుపబడింది.

ప్రస్తుతం ఈ ప్రబంధానికి, శ్రీ రంగనాథునకు మధ్య ఉండే కొన్ని విశేషాలను ఈ వ్యాసంలో ప్రస్తావించడం జరుగుతున్నది.

### శ్రీరంగనాథునిలోని వ్యూహసౌహార్దం

తిరువాయ్ మొళి దివ్య ప్రబంధంలో అళ్వార్లు ఆయా దివ్యదేశాలలోని అర్చారూపాల వైభవాన్ని కీర్తించారు. వారు అనుగ్రహించిన సూక్తులను ఆధారంగా చేసుకుని పరిశీలిస్తే, ఒక్కొక్క మూర్తిలోనూ ఒక్కొక్క కళ్యాణ గుణాన్ని విశేషించి ఆళ్వారులు దర్శించారని, దానిని వారు తమ సూక్తులలో కీర్తించారని, ఆచార్య హృదయగ్రంథకారులు అయిన నాయనార్ అనే ఆచార్య హృదయం అనే దివ్య గ్రంథంలో తెలియజేశారు. వారు తెలిపిన క్రమాన్ని అనుసరించి చూసినప్పుడు, శ్రీరంగంలో ఉండే శ్రీ రంగనాథుని దివ్యమూర్తిలో వ్యూహ సౌహార్దం అనే ఒక గొప్ప గుణం ప్రకాశిస్తున్నది. అంటే, " ఈ కల్పాంతంవరకు ఇక్కడే ఉండి, ఈ చేతనులను

ఉద్ధరించాలి" అనే మంచి హృదయాన్ని శ్రీరంగనాథుడు కలిగి ఉన్నాడు – అనే విశేషాన్ని ఆళ్వారులు దర్శించినట్లుగా వారు అభిప్రాయపడ్డారు.

### వేయి పాశురాలు శ్రీరంగనాథునకే

శ్రీపరాశర భట్టర్ అనే ఆచార్యులు నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధంలోని వేయి పాశురాలు కూడా శ్రీరంగంలోని శ్రీరంగనాథుని కీర్తిస్తున్నవని, మిగిలిన క్షేత్రాలలో ఉండే అర్చామూర్తులకు అయితే ఏవో కొన్ని కొన్ని దశకాలను మాత్రం వారు అనుగ్రహించారని, ఇటువంటి భావం ఆళ్వారుల పాశురాలను బట్టి వ్యక్తం అవుతున్నదని అన్నారు. దీనికి ప్రమాణం పైన ఉదాహరించిన "వాన్ తికழும்" అనే పాశురమే.

తాను యువరాజుగా పట్టాభిషేకం చేసుకోవడానికి ముందు నాడు శ్రీరాముడు, సీతతో కలసి ఇక్ష్వాకు కులదైవం అయిన నారాయణుని సన్నిధికి వెళ్లిన విషయాన్ని వాల్మీకి రామాయణంలోని ఈ క్రింది శ్లోకం తెలుపుతున్నది.

**"తతో పురోహితే రామః స్నాతో నియతమానసః,**

**సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్"**

ఈ నారాయణ స్వామియే విభీషణుని మూలంగా శ్రీరంగానికి వచ్చి చేరిన విషయం శ్రీరంగమాహాత్యంవల్ల తెలుసుకోవచ్చు. తిరువాయ్ మొళి దివ్య ప్రబంధంలో ప్రారంభంలోనూ, మధ్యలోను, చివరిలోనూకూడా ఈ నారాయణ పదం ప్రయోగింపబడడంవల్ల, ఈ ప్రబంధం మొత్తం ఆ నారాయణునకే చెందినది అని నిశ్చయింపబడింది.

అందువల్ల పైన భట్టర్ పలికిన సూక్తి మిక్కిలి పొసగుతుంది.

## ఏడవ శతకంలో శ్రీవేంకటేశ్వరుడు

తిరువాయ్ మొళి ప్రబంధంలోని చాలా ఎక్కువ శతకాలలో, అంటే, ఐదవ, ఏడవ శతకాలు తప్ప, మిగిలిన అన్ని శతకాలలోనూ అళ్వార్లు ఒక్కసారి అయినా శ్రీవేంకటేశ్వరుని నేరుగా ప్రస్తావించారు అని ఆ గ్రంథాన్ని పరిశీలించినప్పుడు తెలుస్తుంది. ఏడవ శతకంలో వేంకటేశ్వరుని ప్రస్తావం లేదు, కానీ, ఈ ఏడవ శతకంలోనే శ్రీరంగనాధథుని కీర్తించే "కంగులుమ్ పగలుమ్" (7–2) అనే దశకం ఉన్నది.

**"మంది పాయ్ వడ వేంగడమామలై వానవర్ గళ్ శంది శెయ్య నిన్ఱాన్ అరంగత్తు అరవినణైయాన్"** (శ్రీరంగంలో ఆదిశేషునిపై శయనించి ఉండే శ్రీరంగనాథుడే, ఆడవానరాలు సంచరించే ఉత్తర దిక్కులో వేంకటాచలంలో నిత్య సూరులు సేవిస్తూ ఉండగా నిలచి ఉన్నాడు) అని మనం అనుసంధించే, తిరుప్పాణ్ ఆళ్వారుల అమలనాదిపిరాన్ అనే ప్రబంధంలో చెప్పబడింది. అందువల్ల శ్రీరంగనాథుడే వేంకటేశ్వరుడు అని చెప్పినట్లు అయినది కదా.

## దక్షిణదిక్కులోని శ్రీరంగం

నమ్మాళ్వార్లు ఏ దివ్యదేశానికి నేరుగా వెళ్ళలేదు. తాము అవతరించిన ఆళ్వార్ తిరునగరిలోనే ఉంటూ, అనేక దివ్యదేశాలలో ఉండే భగవంతుని మూర్తులను మానసికంగా సాక్షాత్కరించి, వాటికి మంగళాశాసనం చేశారు. శ్రీరంగం అనేది అళ్వార్ తిరునగరికి ఉత్తరాదిక్కులో ఉన్నది. అయితే ఆళ్వారులు "తెన్ తిరువరంగం కోయిల్ కొండానే! " (రక్షణ దిక్కులో ఉండే శ్రీరంగాన్ని నివాసంగా చేసుకున్నావాడా!) (7–2–9) అని కీర్తించారు. " ఉత్తర దిక్కులో ఉండే శ్రీరంగం" అని పాడకుండా, "దక్షిణ దిక్కులో ఉండే శ్రీరంగం" అని అనడానికి ఏమి కారణం? అని అంటే, దానికి ముందు దశకం అయిన "ఉలగముండ పెరువాయా!"

అనే దశకంలో శ్రీవేంకటేశ్వరుని కీర్తించేటప్పుడు, ఉన్నడిక్కీழ் అమర్ న్దు పుగుందేనే" (నీ పాదాల చెంత అమరి ఉండి, ఆశ్రయించాను) (6 –10– 10) అని కీర్తించినందువల్ల, ఆఱవ శతకం ముగిసినప్పటికీ, ఈ ఏడవ దశకంలోని రెండవ దశకాన్ని పాడేటప్పుడు కూడా, శ్రీవేంకటేశ్వరుని శ్రీచరణాలలోనే ఉండి, పాడుతున్నారు కాబోలు! ("తెన్" అనే పదానికి ఇక్కడ "అందమైన" అనే అర్థం కూడా చెప్పవచ్చు. ఇది వేరొక విధమైన అర్థసమన్వయం)

## "కంగులుమ్ పగలుమ్" (7–2) దశకమ్

నమ్మాళ్వారులు "కంగులుమ్ పగలుమ్" (7–2) అనే దశకంలో తిరువాయ్ మొళి దివ్యప్రబంధంలోని 10 శతకాలలో తెలియజేసిన పది అర్థాలను సంగ్రహించి సూచించారు. ఈ దశకం శ్రీరంగనాథుని ఉద్దేశించి అనుగ్రహింపబడినది అయినందువల్ల, పూర్వం చెప్పినట్లుగా, "వాన్దికழுమ్ శోలై మదిళ్ అరంగర్ వణ్ పుకழ் మేల్ ఆన్ద తమిழ் మఱైగళ్ ఆయిరముమ్" మన పూర్వాచార్యులు భావించారు ఆ పది శతకాలలోని అర్థాలను కొంచెం వివరంగా ఇక అనుభవిద్దాం.

ఈ ప్రబంధంలోని ఒక్కొక్క శతకంలోనూ భగవానుడు ఆళ్వార్లకు దర్శింపజేసిన ఒక్కొక్క కళ్యాణ గుణాన్ని ఈ " కంగులుమ్ పగలుమ్" అనే దశకంలో అనుభవింపజేసిన క్రమం ఈ విధంగా ఉన్నది.

## 1) పరత్వమ్

పరత్వం అంటే, తాను అన్నిటికంటే చాలా గొప్పవాడై ఉండడం. ఇది మొదటి శతకంలో ఆళ్వారులకు భగవానుడు అనుభవింపజేసిన కల్యాణ గుణం. దీనిని ఈ దశకంలోని ఆరవ పాశురంలో " విణ్ణోర్ ముదల్ ఎన్నుమ్" (7–2–6)

(నిత్యసూరులకు ప్రభువు) అని పలికి, పరత్వంలోని పరాకాష్టను చెప్పడానికి ఆరంభించారు. ఆ తరువాత ఈ దశకంలోని చివరి పాశురంలో, " మూవులకు ఆళియే ఎన్నుమ్, కడి కమ**ழ்** కొన్ద చ్చడైయనే ఎన్ను మ్, నాన్ముగ క్కడవుళే ఎన్నుమ్" (7–2–10) (ముల్లోకాలను పాలించేవాడా! అని, సువాసన వెదజల్లే గన్నేరు పువ్వులను కల జటలను కలవాడా! అని, చతుర్ముఖ దైవమా!) అని ముగించి, "వణ్ తిరువరంగనే! " (అందమైన శ్రీరంగానికి నాయకుడా అని ఆ దశకాన్ని ముగించారు. "మూవులకు ఆళి" అని మూడు లోకాలను పాలించే ఇంద్రునకు, "కడి కమ**ழ்** కొన్ద చ్చడైయనే! " అని గన్నేరు పువ్వులను శిరస్సులో ధరించే రుద్రునకు, "నాన్ముగ క్కడవుళ్" అని నాలుగో ముఖాలను కలిగిన బ్రహ్మకు అంతర్యామిగా ఉండి, వారిని నిర్వహాలను తాను నిర్వహిస్తున్నాడు అని, "ఎల్లప్పుడు భగవంతునకు సేవ చేయడం వల్ల కలిగే ఆనందాన్ని అందంగా ప్రకాశించేటట్లు ఉండే నిత్యసూరులకు నాయకుడు " అని చెప్పడం ద్వారా శ్రీరంగనాథుని అతిశయించిన స్థితి అయిన పరత్వాన్ని మనకు ఆళ్వార్లు తెలియజేశారు. " వణ్ తిరువరంగనే! " అని అన్నందువల్ల, ఈ లోకంలో నివసించే మనకుకూడా దర్శనాన్ని అనుగ్రహిస్తున్నాడు – అని అర్థం అవుతున్నది. అందువల్ల బద్దముక్త నిత్యులకు, దేవతలకు, ఇంద్రునకు, శివునకు, బ్రహ్మకు ప్రభువై ఉండేవాడు – అని ఈ పాశురంలో చెప్పి, ఈ తిరువాయ్ మొళి ప్రబంధంలోని మొదటి శతకంలో ప్రతిపాదింపబడే పరత్వగుణాన్ని సూచించారు.

## 2) కారణత్వమ్

కారణత్వం అనేది –తానే అన్నిటికీ మూల కారణంగా ఉండడం. ఈ లోకాన్ని సృష్టించి దాని లోపల ఉండే జీవరాశసులను సృష్టి చేసి, మహాప్రళయం,

ఇంకా, అవాంతర ప్రళయం వచ్చినప్పుడు, వాటిని తనలో పెట్టుకుని కాపాడి, తరువాత, మళ్ళీ సృష్టి ప్రారంభంలో పూర్వంవలె సృష్టించడం. ఈ కారణత్వ గుణమే తిరువాయ్ మొళి ప్రబంధంలోని రెండవ శతకంలో ప్రతిపాదింపబడింది. దీనిని ఈ "కంగులుమ్ పగలుమ్ " అనే దశకంలోని రెండవ పాశురంలో " మున్ శెయ్ దు ఇవ్వులకమ్ ఉండు ఉమిழ் న్ద" (పూర్వం సృష్టిప్రారంభంలో ఈ లోకాన్ని సృష్టించి, మళ్ళీ ప్రళయసమయంలో తనలో పెట్టుకుని) అని చెప్పినందువల్ల రెండవ శతకంలో ప్రతిపాదింపబడే అర్థం అయిన కారణం ఇక్కడ చెప్పబడినట్లు అయినది.

### 3) వ్యాపకత్వమ్

వ్యాపకత్వం అంటే, అంత టా ఏ లోటు లేకుండా వ్యాపించి ఉండడం. భగవంతుడు పరిచ్ఛేదించడానికి సాధ్యం కాని రీతిలో, అంటే, ఇక్కడ ఉన్నాడు, అక్కడ లేడు, ఇప్పుడు ఉన్నాడు, అప్పుడు లేడు, ఈ రూపంలో ఉన్నాడు, ఆ రూపంలో లేడు అని చెప్పడానికి సాధ్యం కాని రీతిలో అంతటా వ్యాపించి ఉన్నాడు – అని చెప్పడమే. భగవంతుని వ్యాపకత్వం అనేది, ఇక్కడ, ఆ స్వామియొక్క లెక్క కట్టడానికి సాధ్యం కాని రీతిలోని రూపంలోని వ్యాప్తిని మనస్సులో పెట్టుకుని చెప్పబడినదా? లేక, పరమాత్మ యొక్క గొప్పవైన కల్యాణ గుణాలను మనసులో పెట్టుకుని చెప్పబడినదా? అని తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్ళాన్ అనే ఆచార్యుల వద్ద ఒకరు ప్రశ్నించారు. అప్పుడు వారు ఇచ్చిన బదులు ఏమంటే – సాధారణ మానవులకు –పరమాత్మ యొక్క పరత్వం గొప్పవైన గుణాలను పురస్కరించుకునే, ఆ స్వామి అంతటా వ్యాపించి ఉండడాన్ని చెప్పడానికి సాధ్యం అవుతుంది. అయితే, భగవంతుడు, తన రూపంలోని అందంతో ఆళ్వారుల హృదయంలో ఏ విధమైన అవకాశం మిగలకుండా ఉండేటట్లు అంతటా వ్యాపించి ఉన్నాడు– అని

అంటున్నారు. ఈ దశకంలో. " కట్కిలీ! ఉన్నై క్కాణుమాఱు అరుళాయ్" (7–2–3) బాహ్యచక్షువులకు గోచరించనివాడా! నిన్ను నేను దర్శించేటట్లు అనుగ్రహించు) అని అంతర్యామిని చెప్పడం వల్ల, ఇంతే కాక, " ఎన్నుడై ఆవియే ఎన్నుమ్" (7–2–9) (నా ఆత్మా! అని) అనడం వల్ల, భగవానుడు తమ మనస్సులో అంతటా వ్యాపించి ఉండడాన్ని చెప్పడంద్వారా, మూడవ శతకంలోని ముఖ్య గుణమైన వ్యాపకత్వాన్ని ఇక్కడ సూచించారు.

## 4) నియంతృత్వమ్

నియంతృత్వం అనేది, భగవంతుడు తానే అన్నిటినీ నిర్వహిస్తాడు – అని చెప్పడం. ఈ గుణం ఈ ప్రబంధంలోని నాలుగవ శతకంలో ముఖ్యగుణంగా ప్రతిపాదింపబడింది. ఈ గుణం ప్రస్తుత దర్శకంలో, " పాల తున్బంగళ్ ఇన్బంగళ్ పడైత్తాయ్" (7–2–7) అని అనడం వల్ల, " ఆయా చోట్లకు తగినట్లుగా సుఖదుఃఖాలను సృష్టిస్తున్నావు " అని, " కాల శక్కరత్తాయ్" (7–2–7) (కాలచక్రాన్ని నిర్వహించేవాడా!) అని అనడం వల్ల కాలతత్వాన్ని నడిపేవాడు అని చెప్పడం ద్వారా పరమాత్మ తానే ముందుండి నడిపించే స్వభావం చెప్పబడినట్లయితే అందువల్ల, ఈ దశకంలో, నాలుగవ శతకంలోని ప్రధాన గుణమైన నియంతృత్వం ప్రతిపాదింపబడినట్లు అయినది.

## 5) కారుణికత్వమ్

కారుణికత్వం అనే గుణం భగవంతుని సహజమైన అంతు లేని కరుణను తెలుపుతుంది. మన సంప్రదాయంలో చెప్పబడే చాలా ముఖ్యమైన కారుణికత్వం – పరమాత్మ మహాప్రళయం సమయంలో అందరు ప్రాణులను తన ఉదరంలో పెట్టుకొని కాపాడడమే. ఎన్నో సందర్భాలలో భగవంతుని గొప్పదైన కరుణాగుణం వ్యక్తం అయినప్పటికీ ఈ క్రింది ప్రస్తావింపబడే మూడు సందర్భాలు మన

ఆచార్యులచేత ప్రియతమంగా ఎల్లప్పుడూ ప్రస్తావింపబడతాయి ఈ ఒక్కొక్క ఉదాహరణం కూడా ప్రాణులందరికీ, వారు ఏమాత్రం ప్రార్థించకపోయినప్పటికీ, భగవంతుడు తన అంతు లేని కరుణను ప్రదర్శించిన సందర్భమే.

భగవంతుడు త్రివిక్రమావతారాన్ని ఎత్తినప్పుడు తన పాదంతో చరాచరాలను అన్నిటిని ప్రేమతో కొలిచి, " తావి అన్షు ఉలగ మెల్లామ్ తలైవిళా క్కొండ ఎందాయ్" (తిరుమాలై– 35) అని తొండరడిపొడి ఆళ్వారులు చెప్పినట్లుగా, " తాళ్ పరప్పి మణ్ తావియ ఈశనై" (3–3–10) (తన పాదాలను వ్యాపింపచేసి భూమిని అంతటినీ కొలిచిన ప్రభువు) అని తిరువాయ్ మొళి ప్రబంధంలో చెప్పినట్లుగాను, ఆ సమయంలో ఉండే అందరి తలల పైన, ఎవరు అడుగకుండానే, తన శ్రీచరణాన్ని పెట్టి, సాక్షాత్తు తన సంబంధాన్ని కలిగించడం.

శ్రీరామచంద్రుడు తాను వైకుంఠానికి తిరిగి వెళ్లేటప్పుడు, అయోధ్యా నగరంలో ఉండే స్థావరాలను, మృగాలను ఇంకా ఉండే ప్రాణులను అన్నిటిని తనతో పాటు తీసుకుని వెళ్లడం. " అన్షు శరాశరంగళై వైకుందత్తు ఏత్తి" (ఆనాడు చరాచరాలను అన్నిటిని వైకుంఠానికి తీసుకుని పోయి) (పెరుమాళ్ తిరుమొళి –10 –10) అని కులశేఖరులు తమ ప్రబంధంలో చెప్పినట్లుగాను, " అయోత్తియిల్ వాழుమ్ శరాశరమ్ ముற்றవుమ్ నల్పాలుక్కు ఉయ్ త్తినన్" (7–5–1) (అయోధ్యలో ఉండే చరాచరాలన్నిటిని వైకుంఠానికి చేర్చాడు) అని తిరువాయ్ మొళి ప్రబంధం చెప్పినట్లుగాను, ఆ కాలంలో ఉండే జీవరాసులకు అందరికీ మోక్షాన్ని అనుగ్రహించడం.

"కున్ఱ మేంది కుళిర్ మழை కాత్తవన్" (3–3–8) (గోవర్ధన పర్వతాన్ని ఎత్తి ఆనాడు వడగళ్ల వాన నుండి కాపాడిన స్వామి) అని తిరువాయ్ మొళి

ప్రబంధంలో నమ్మాళ్వార్లు అనుగ్రహించినట్లుగాను, " మణ్ణுక్కు అన్ను వరై మున్ ఏందుమ్ మైందనే" (తిరుమాలై – 36) అని తొండరడి ప్పొడి ఆళ్వారులు అనుగ్రహించినట్లుగాను, ఆకలి కోపంతో ఇంద్రుడు ఏడునాళ్లపాటు నిరంతరంగా వడగళ్ల వానను కురిపించినప్పుడు, రేపల్లెలోని గో గోపీగోపాలజనాన్ని అంతటినీ గోవర్ధన పర్వతాన్ని ఎత్తి రక్షించడం.

ఈ విధంగా పైన ప్రస్తావించిన పాశురాలు ఏవో కొన్ని ఉదాహరణలు మాత్రమే. చెప్పవలసి వస్తే, ఆళ్వార్లు అందరూ ఈ చరిత్రను ఎన్నో పర్యాయాలు అనుసంధించారు ఈ విధంగా ఉండే భగవంతుని కరుణను ఆళ్వార్లు తిరువాయ్ మొళి ప్రబంధంలోని ఐదవ శతకంలో ప్రధానమైన గుణంగా అనుభవించారు.

దీనిని ఆళ్వారులు ప్రస్తుత దశకంలో " మున్ శెయ్ దు ఇవ్వులకుమ్ ఉండు ఉమిழ்న్దు అళందాయ్" (7–2–2) (పూర్వం ఈ లోకాలను సృష్టించి, ప్రళయకాలంలో లోపల పెట్టుకుని, మళ్ళీ సృష్టి కాలంలో వెలువరించి, వాటిని కొలిచి రక్షించావు) అని "ఇవళ్ తిఱత్తు ఎన్ శెయ్ గిన్డాయ్? " (7–26) (ఈమె విషయంలో ఏమి చేయదలచావు?) అని, "కున్ఱు ఏంది కోనిఱై కాత్తవన్" (7–2–8) (గోవర్ధన పర్వతాన్ని ఎత్తి గోవుల సమూహాన్ని కాచినవాడు –° అని చెప్పడం వల్ల అనుసంధించినట్లు అయినది.

## 6) శరణ్యత్వమ్

శరణ్యత్వం అనేది అందరికీ గొప్ప శరణమై, అభయాన్ని ఇవ్వగలిగి ఉండడం. ఈ గుణాన్ని తిరువాయ్ మొళి ప్రబంధంలో ఆఱవ శతకంలో ప్రధానమైన గుణంగా ఆళ్వారులు అనుభవించారు. దీనిని ప్రస్తుత దశకంలో " పற்றிలార్ పற்ற నిన్డానే" (7–2–7) (ఏ ఆలంబనం లేనివారు నిన్ను ఆశ్రయించేటట్లుగా

ఉన్నవాడా!) అని అతనిని ఆశ్రయించాలనే ఉద్దేశ్యం లేనివారికి కూడా శరణాగతిని అనుగ్రహించి రక్షించాలని భావించేవాడు – అని అళ్వార్లు ఈ దశకంలో చెప్పినందువల్ల శ్రీరంగనాథుడు శరణ్యుడు అని చెప్పినట్లయినది.

## 7) శక్తత్వమ్

శక్తత్వం అంటే, అన్ని విధాలైన మనోరథాలను నెరవేర్చగలిగిన శక్తి కలిగినవాడై ఉండడం. భగవంతుని విషయంలో ఈ గుణాన్ని ఆళ్వారులు ఏడవ శతకంలో ముఖ్యమైన గుణంగా అనుభవించారు.

ప్రస్తుత దశకంలో ఈ గుణాన్ని ఆళ్వారులు " అందిపోప్పోదు అవుణన్ ఉడల్ ఇడందానే! " (7–2–5) (సంధ్యాసమయంలో హిరణ్యకశిపుని శరీరాన్ని చీల్చినవాడా!) అని సింహావతారంలో భగవంతుని గొప్పతనాన్ని చెప్పి, " అలైకడల్ కడైంద ఆరముదే! " (7–2–5) (కెరటాలతో నిండిన సముద్రాన్ని చిలికిన అరుదైన అమృతమా!) అని పాలసముద్రాన్ని చినికి అమృతాన్ని ఉద్ధరించి దేవతలకు ఇచ్చిన కూర్మావతారంలోని భగవంతుని గొప్పతనాన్ని, " ఉట్కుడై అశురర్ ఉయిరెల్లా ముండ ఒరువనే! " (7–2–3) (మనసులో క్రౌర్యాన్ని కలిగిన అసురులను ప్రాణాలను హరించిన అద్వితీయుడా!) అని అసురుల ప్రాణాలను సంహరించినవాడు అని చెప్పి, ఆ స్వామి శక్తికి కొన్ని ఉదాహరణాలను ప్రస్తావించడం ద్వారా అనుసంధించారు.

## 8) సత్యకామత్వమ్

సత్యకామత్వం అంటే, కోరదగిన గుణాలు అన్నీ కలిగినవాడు అని అర్థం. అతడు ఆశపడే పొందదగినది ఏదీ లేదు, అన్నిటినీ పొందినవాడు– అనేదే, ఇది. ఈ

గుణాన్ని ఆళ్వారులు ఎనిమిదవ శతకంలో ప్రధాన ప్రతిపాద్య గుణంగా అనుభవించారు.

ఆ శతకంలోని మొదటి దశకంలో మొదటి పాశురంలో ప్రారంభంలో ఆళ్వారులు – భగవంతుని అందానికి, గొప్పతనానికి, శక్తికి తగినవారు, దివ్యపత్నులైన శ్రీదేవి, భూదేవి – అనే విషయాన్ని " తేవిమారావార్ తిరుమకళ్ పూమి ఏవ" (8–1–1) భగవంతునకు తగినవారైన లక్ష్మీదేవి, భూదేవి భగవంతుని సేవలో ప్రేరేపించగా) అని చెప్పడంద్వారా ఈ గుణాన్ని సూచించారు.

దీనిని ప్రస్తుత దశకంలో " ఎన్ తిరుమకళ్ శేర్ మార్బనే! " (7–2–3) (ఆ లక్ష్మీదేవి ఆధివసించే వక్షఃస్థలాన్ని కలవాడా!) అని, " నిలమకళ్ కేళ్వనే! " (7–2–9) (భూదేవి నాయకుడా!) అని, " ఆయ్ మకళ్ అన్బనే! " (నీళాదేవికి నాయకుడా!) (7–2–9) అని ముగ్గురు దివ్య పత్నులను ప్రస్తావించారు. ఇంతకుముందు చెప్పినట్లుగా, దివ్యదేవేరులతో అతడు వేంచేసి ఉన్నందువల్ల దివ్యదేవేరులు జీవాత్మలను అందరిని తమ బిడ్డలుగా భావించి, మనకోసం ఆస్వామి దగ్గర పురుషకారాన్ని చేయడం వల్ల, అతడు మనకు కావలసిన కరుణను చూపించి, మన మనోరథాలను అనుగ్రహిస్తాడు. ఈ విధంగా ఈ ఎనిమిదవ శతకంలోని ప్రధాన గుణమైన సత్యకామత్వాన్ని ప్రస్తుత దశకంలో ఆళ్వారులు అనుసంధించారు.

### 9) ఆప్తసఖత్వమ్

ఆప్తసఖత్వం అంటే, మన క్లేశాలను తీర్చగలిగినవాడై, కష్ట సమయాలలో మన వెంట ఉండేవాడై ఉండడం. ప్రళయ కాలంలో మనలను అతడు తన ఉదరంలో పెట్టుకొని కాపాడడం. ఈ గుణాన్ని ఆళ్వార్లు తొమ్మిదవ శతకంలో ప్రధానమైన గుణంగా అనుభవించారు.

దీనిని ప్రస్తుత దశకంలో, " మున్ శెయ్ దు ఇవ్వులకమ్ ఉండు" (7–2–2) (పూర్వం ఈ లోకాలను సృష్టించి కడుపులో పెట్టుకొని కాపాడి) అని అనడం వల్ల శ్రీకృష్ణుడై గోవర్ధన పర్వతాన్ని ఎత్తి రేపల్లెలో ఉండే అందరిని

రక్షించడానికి తెలిపే " కున్ఱ మేంది కోనిఱై కాత్తవన్" (7–2–8) (గోవర్ధన పర్వతాన్ని ఎత్తి గోవుల సమూహాన్ని కాపాడినవాడు) అని చెప్పడం వల్ల అనుసంధించారు.

## 10) ఆర్తిహరత్వమ్

ఆర్తిహరత్వం అనే ఈ గుణం– భగవంతుడు మన క్లేశాలను అన్నిటిని పోగొట్టగలిగేవాడై ఉండడాన్ని తెలుపుతుంది. "మోక్షం మనకు లభించలేదే! " అని మనం పడే క్లేశం కూడా ఇందులో చేరుతుంది. ఈ గుణంలోని అనుభవాన్ని భగవంతుడు ఆళ్వారులకు తిరువాయ్ మొళి ప్రబంధంలోని పదవ శతకంలో అనుగ్రహించాడు.

దీనిని ప్రస్తుత దశకంలో ఆళ్వారులు " ఆడి అడైయాదాళ్ పోల్ ఇవళ్ అణుకి అడైందనళ్ ముకిల్ వణ్ణనడియే" (7–2–10) అని, " ముగిల్వణ్ణన్ అడియై అడైందు అరుళ్ శూడి ఉయ్ న్దనళ్" (7–2–11) అని చెప్పడం వల్ల ఈ గొప్ప గుణాన్ని ఆళ్వార్లు అనుసంధించినట్లయినది.

ఈ విధంగా తిరువాయ్ మొళి దివ్యప్రబంధంలోని 10 శతకాలలోని 10 గుణాలు ఈ "కంగులుమ్ పగలుమ్" అనే దశకంలో ఉండడం చేత, ఈ ప్రబంధం మొత్తం శ్రీ రంగనాథునే విషయంగా కలిగినది అనేది మన పూర్వాచార్యుల అభిప్రాయం.

ఈ క్రమంలో ఈ తిరువాయ్ మొడళి ప్రబంధాన్ని మొత్తం శ్రీరంగనాథునకే సమర్పించిన శ్రీశఠకోపులకు "నమ్మాళ్వార్" అని శ్రీరంగనాథుడు బిరుదాన్ని ఇవ్వడం చాలా సమంజసమైనది. అదే విధంగా ఈ దశకంలోని అనేక పాశురాలలో "తిరువరంగత్తాయ్! " అని సంబోధించడం "శ్రీరంగంలో ఉండేవాడు" అనేదానిని చెప్పడం కోసమే అయినప్పటికీ, "తాయ్" అని కీర్తింపబడే ఆళ్వారుల సూక్తులకు తగినట్లుగా "లోకాలను అన్నిటిని తల్లిగా ఉన్నాడు" ("తిరువరంగత్తు ఆయ్") – అనే విషయాన్ని లోకానికి తెలుపడం కోసంగా మాయావతారం అయిన మోహినీ

అలంకారంలో ఒక్కొక్క సంవత్సరం శ్రీరంగనాథుడు అనుగ్రహించడానికి మనం ఈ సమయంలో భావించవచ్చు. స్వస్తి.

★★★★★